# రమ

[శరత్ బాబు నాటకం]

631

అనువాదం:

గద్దె లింగయ్య



ఆదర్శ గ్రంథమండలి

విజయవాడ



# రమ

## ప్రథమాంకము

### మొదటి దృశ్యం.

[శ్రీ. శే. యదునాథముఖర్జీ యింటి వెనకభాగము. దొడ్డివాకిలి తెరచి వున్నది. ఎదురుగా చిన్న సందు. నాల్గువైపులా మామిడి - పనసతోటం కొంచెం దూరంలో చెరువురేవు కన్పించుతుంది. ప్రాతఃకాలము. రమ, ఆమె పెత్తల్లి స్నానానికి బయల్దేరారు. ఎదుటివేపునుండి వేణీఘోషాలు వస్తాడు. రమకు ఇరవై రెండు ఇరవైమూడేళ్ళకు మించివుండవు. అల్పప్రాయంలోనే విధవఅయింది. కాబట్టి చేతులకు కొద్దిగాజులుమాత్రమే వున్నై. సన్నంచు పంచె కట్టుకున్నది. వేణీ వయస్సుకూడ ముప్పైఅయిదు ముప్పైఆరు కంటె ఎక్కువవుండదు.]

వేణీఘోషాల్—రమా, నేను నీదగ్గరకే వస్తున్నాను.

పెత్తల్లి—సరేగాని, అబ్బాయ్, దొడ్డివాకిలిని వస్తున్నావే?

రమ—పెద్దమ్మా, నువ్వు బలేదానవే. పెద్దబావ పరాయివాడా? మనయింట్లోమనిషికి తలవాకలేమిటి, దొడ్డివాకిలేమిటి?—పనేమైనా వున్నదా? అయితే పద, లోపలికివెళ్ళి కూర్చో, నే నిప్పుడే రెండుబుటకలువేసి చక్కన వస్తాను.

వేణీ—లేదమ్మా, కూర్చోటానికి తీరికలేదు, చాలా పనులున్నై—నువ్వేం నిర్ధారణచేసుకున్నావేమిటి?



రమ—నిర్ధారణ ఏ విషయంలో పెద్దబావా?

వేణీ—మా బాబాయి శ్రాద్ధం విషయంలో నమ్మా. నిన్న రమేశ్ వచ్చాడు. తనతండ్రి శ్రాద్ధకర్మ మ[illegible]డం బరంగా చేస్తాట్ట! నువ్వు వెళ్తావా?

రమ—నేనా? తారిణీఘోషుయింటికి వెళ్తానా!

వేణీ—అవునమ్మా, ఎవరు వెళ్ళినా నువ్వు వ్యక్తిగానూ ఆ యింట్లో అడుగుపెట్టవని నాకుతెలుసు. కాని, ఆ కుర్రాడు తానే యింటింటికీ తిరిగి పిలుస్తాడని విన్నాను. మాయమాటలు చెప్పటంలో వాడు వాళ్ళ అబ్బనే తీసి పోడు. మరి వాడే వచ్చి నిన్నుపిలిస్తే ఏం చెప్తావ్?

రమ—నేను చెప్పటం ఎందుకు బావా! బయట దర్వానే చెప్తాడుగా జవాబు.

పెత్తల్లి—వాడు చెప్పటమేమిటి? నాకేం మాటలురావా? ఆ దుష్టుడికి మళ్లీ యీజన్మలో ముఖర్జీయింటిగుమ్మం తొక్కకుండా చెడామడాఅంటిస్తాను. తారిణీఘోషు కొడుకు భోజనానికి పిలిచేందుకు వస్తాడా మాయింటికి? నేనేమీ మర్చిపోలేదు వేణీ! తారిణీఘోషు ఈ పిల్లాడికే మా రమని పెళ్లిచేసుకోవాలని చూచాడు. అప్పటి కింకా యతీంద్రుడు పుట్టలా. ఆ పెళ్లి జరిగితే ముఖర్జీ యావదాస్తీ వచ్చిపడుతుందనుకున్నాడు. తెలిసిందా అబ్బాయ్?

వేణీ—అవును, పెద్దమ్మా, ఎందుకు తెలియదు? అది అందరికీ తెలిసినదేగా. తా ననుకున్నట్టు జరక్కపోయేసరికి ఈ భైరవాచార్యునితో ఏమేమో [illegible]తీపాట్లు,

మంత్ర-తంత్రాలు చేయించి అమ్మాయి అదృష్టంలో నిప్పులుకురిపించాడు. ఆర్నెల్లు తిరక్కుండానే ఈమె పాపాలమీది సిందూరం తుడిచెయ్యాల్సొచ్చింది. ఎంతనీచుడు కాకపోతే యదుముఖర్జీకుమార్తెను కోడలుగా చేసుకోవా లనుకుంటాడా? దుర్మార్గుడు అలాంటిచావే చచ్చాడు లే. కోర్టులో వ్యాజ్యమాడ టానికి వెళ్ళి తిరిగిరాకుండానే చచ్చాడు. ఒక్కగాని ఒక్కకొడుకువుంటే వాడిచేతి కొరివైనా దక్కిందా నీచుడికి!

రమ—పెద్దమ్మా, ఒకర్ని నీచుడని నిందించటం ఎందుకు. తారిణీఘోషు పెదబావకి సయానా పినతండ్రేకదూ? బ్రాహ్మణ్ణి నీచుడనట మెందుకు? నీ నోరూరుకోదమ్మా.

వేణీ—[కొంచెం లజ్జపడి] కాదు రమా, పెద్దమ్మ సరిగానే చెప్పింది. నువ్వెంత ఘరానాకుటుంబానికిచెందిన దానివి! బతే, నిన్ను మాయింటికి తెచ్చుకోగలమా అమ్మాయ్? మాబాబాయినోట అలాంటిమాట రావ టమే అవమానకరం. ఇక మంత్ర - తంత్రాలసంగతీ యదార్థమే. బాబాయి, భైరవాచార్యుడు చేయరాని పనే లేదు ఈప్రపంచంలో. రమేశుడు రాగానే ఈ దుర్మార్గుడుపోయి వాడికి సంరక్షకుడయ్యాడు.

పెత్తల్లి—వేణీ, వాడిసంగతి అందరికి తెలిసినదేగా. కుర్ర కుంక పది పన్నెండేళ్ళవరకు యింటికే రాలేదు. వాడి మేనమామవచ్చి, కాశీకో ఎక్కడికో తీసుకెళ్ళాడట.

మళ్ళీ యిటువేపే రానివ్వలేదు  ఇన్నాళ్ళూ ఎక్కడ ఉన్నట్టు? ఏంచేస్తున్నట్టు?

వేణీ—నాకుమాత్రం ఏం తెలుసు పెద్దమ్మా! బా[illegible]యితో మీకున్నట్లే, నా పొత్తూను. ఇన్నాళ్ళూ బొంబాయి లోనో ఎక్కడో ఉన్నాడని విన్నాను. ఒకరు డాక్టరు ప్యాసయ్యాడంటే, మరొకరు ప్లీడరు అయ్యాడంటూారు. ఇదంతా కల్పన. ఏ దసలు త్రాగుబోతు. ఇంటికి వచ్చేటప్పుడే వాడికళ్ళు చింతనిప్పుల్లాగున్నాయి.

పెత్తల్లి—అలాగా! అట్లయితే వాణ్ని గుమ్మంలో అడుగు పెట్టనివ్వకూడదు.

వేణీ—అవును. రానివ్వనేకూడదు. ఏం రమా, నీకు రమేశ్ గుర్తున్నాడా?

రమ—[కొంచెం సిగ్గుపడి నవ్వుతూ] పెద్దబావా, నిన్న మొన్న జరిగిందేగా. ఆయన నాకంటె ఏ నాలుగేళ్ళో పెద్ద వాడు. ఒక బడిలో చదువుకుని, ఒక్కచోటే కలసి ఆడుకున్నామాయె. నేను వారియింట్లో తిరుగుతూండే దాన్నిగదూ. అత్త నన్ను తన కూతురులాగే చూచుకునేది.

పెత్తల్లి—ఆ చూచుకోవటం మండిపోను! తమకోర్కె తీర్చు కోటానికే ఆ నటనంతాను. నిన్నెలాగైనా వళ్లో వేసు కోవాలని వలపన్నారే వల! రమేశ్ తల్లిమాత్రం తక్కువదనుకున్నావాయేం? మహా మాయలమారి!

వేణీ—అందులో సందేహమేముంది? పిన్నికూడా—

రమ—చూడు పెద్దమ్మా, మీ రేమన్నా అత్తగారిప్పుడు స్వర్గంలో ఉన్నది. మీ రామెను నిందించటం నేను విన్నలేను.

పెత్తల్లి—ఏమిటే నువ్వనేది? నీ కింత...

వేణి—అవు నవును, ఈమె అన్నదే నిజం. పిన్ని గొప్పింటి ఆడపడుచుకదా. ఆమె ప్రసక్తివస్తే ఇప్పుడుకూడ అమ్మ కళ్ళల్లో నీరుక్రమ్ముతుంది. ఇంక ఆవిషయాలు పోనీండి. అయితే మరి ఆ విషయం ఖాయమేగా రమా? మళ్ళీ మార్పేమీ జరుగదుకదూ?

రమ—[నవ్వి] లేదు బావా! ఋణశేషం శత్రుశేషం వుంచ కూడదని నాన్నగారు అంటూండేవారు. తారిణీ ఘోషు బ్రతికుండగా మమల్ని తక్కువేమీ పీడించ లేదు. ఆఖరికి నాన్నగారినికూడ జైలుకు పంపటానికి ప్రయత్నించాడు. నేనివన్నీ మర్చిపోతానా? బ్రతి కుండగా మర్చిపోను పెద్దబావా! రమేశ్ ఆ విరోధి కొడుకేగదూ. మేము వెళ్ళం సరిగదా, మాతో సంబంధం వున్నవారినికూడ వాళ్ళ గడప తొక్క నియ్యం.

వేణి—అదే కావాల్సింది. నీకు తగినమాటే మాట్లాడావు రమా.

రమ—బ్రాహ్మలెవరూ వారి యింటికిపోకుండా చేసే వుపాయ మేమీ లేదా బావా? అలా జరిగితే......

వేణి—నేను చేస్తున్నది అదేనమ్మా. నువ్వు నాకు తోడుగా వుంటే ఇంకే చింతా లేదు. నేను రమేష్ని ఈవూరు

నుంచి తరిమెయ్యకపోతే నాపేరు వేణీఘోషే కాను. ఆ తర్వాత నే నున్నాను, ఆ వెధవ ఆచార్యులు వున్నాడు. బాబాయి లేనేలేడు. ఇంక [illegible]గాడిని ఎవరు కాపాడుతారో చూస్తాను!

రమ—[నవ్వి] రమేష్‌ఘోషే కాపాడుతా డనుకుంటాను. వారూ మనల్ని సాధించకుండా వదిలిపెట్టరు బావా!

వేణీ—[అటూయిటూచూచి స్వరం తగ్గించి] రమా, ఇంకా అతనికి ఆస్తి-పాస్తులు, డబ్బూ-దస్కం సంగతు లేవీ తెలియవు. మొక్కగా వున్నప్పుడే పీకిపారవేయక పోతే, మ్రానైనతర్వాత కదుల్తుందా? అతను తారిణీ ఘోషుకొడుకన్నసంగతి నువ్వు రేయింబగల్లు మన సులో వుంచుకోవాలి. బాగా పాతుకుపోయాడంటే ఇంక ... ...

[రమ ఉలిక్కిపడుతుంది. వెంటనే ద్వారంగుండా రమేష్ లోపలికి వస్తాడు. పాదాలకు చెప్పుల్లేవు. తలకు పంచె చుట్టుకున్నాడు.]

రమేష్—[వేణీని చూడగానే] అరె, అన్నయ్య యిక్కడు న్నాడా! రండి రండి. మీరు లేకపోతే ఇదంతా ఎవరు నిర్వహించుతారు అన్నయ్యా? నేను మీ కోసం వూరంతా వెతుకుతున్నాను. రాణి యేదీ? యింట్లో ఎవరూ లేరే. యిటు వచ్చిందని చెప్పిందే దాసి.

[రమ తలొంచుకుని నిలబడివున్నది]

రమే—[చటుక్కున ఆమెనుచూచి] అర్రె, ఇక్కడే వున్నావే. ఎంత పెద్దదానవయ్యావు! బాగున్నావా? నన్ను గుర్తు పట్టలేదల్లేవున్నదే. నేను నీ రమేష్ బావని.

రమ—[తలెత్తి అతనివంక చూడకుండా నే, కోమలకంఠంతో]
మీరు బాగున్నారా?

రమే—బాగానే వున్నాను! కాని రాణీ, నన్ను 'మీరు' అంటున్నావెందుకు? [వేణీవైపు తిరిగి] అన్నయ్యా, రమమాటొకటి నే నెన్నడూ మర్చిపోలేను. మా అమ్మ చనిపోయేప్పటికి రమ చాలాచిన్నది. కాని అప్పుడే ఈమె నా కన్నీళ్లు తుడుస్తూ 'రమేశ్ బావా, నా అమ్మనే మనిద్దరం పంచుకుందాం' అన్నది. [రమనుద్దేశించి] బహుశా నీకీ మాట జ్ఞాపకంలేదేమో, ఏం, జ్ఞాపకంలేదు కదూ? మా అమ్మ జ్ఞాపకంవుందా?

[రమ మారుపల్కదు. సిగ్గుచే తల మరింత వంచుకుంటుంది]

రమే—కాని, రాణీ, యింకవ్యవధి ఎంతో లేదు. ఏమేమి చెయ్యాలో అంతా ఏర్పాటుచెయ్యి. వెనుకదిక్కు లేనివాడని మీ వాకిట్లోకి వచ్చాను. మీరు రాకపోతే ఏర్పాట్లేమీ జరుగవు. త్వరగా రండి.

పెత్తల్లి—[రమేశ్ ని సమీపించి అతని మొహంకేసి చూచి] ఏం అబ్బాయ్, తారిణీఘోషు కొడుకువా యేం?

[రమేష్ చకితుడై చూస్తుంటాడు]

పెత్తల్లి—నువ్విదివరకెప్పుడూ నన్ను చూళ్లేదులే. నేను రమకి సయానా పెత్తల్లిని. అబ్బాయ్, నీలాంటి సిగ్గులేనివాడిని నే నెక్కడా చూళ్ళేదే! ఒక కబురూ లేదు, మాటా లేదు, ఈ విధంగా దొడ్డివాకిలిని సంసారులయింట్లో దూరి గడబిడ చెయ్యటానికి సిగ్గు లేదూ నీకు?

రమ—పెద్దమ్మా, ఏమిటి నీవాగుడు! స్నానానికి వెళ్లరాదూ.

[వేణీ మెదలకుండా నిష్క్రమించుతాడు.]

పె. తల్లి—లేదు రమా, వాగటంలేదు. చేయదల్చుకున్నది చెప్పెయ్యటానికి మీలాగా నా కేమీ మొహమాటం లేదు. బలే! వేణీ, ఈ విధంగా పారిపోవటం ఎందుకు? 'తమ్ముడూ, మీయింట్లో నీళ్ళు మోసేందుకూ, పిండి విసరటానికీ మేము నీ దాస - దాసీలము, ప్రజలమూ కాదని చెప్పేసి పోవాల్సింది. 'తారిణీ చచ్చిపోతే జనానికి గుండెలు చల్లబడినై'. ఈ మాట అనటానికే ఆడవాళ్ళం మనల్ని వదిలిపెట్టిపోకపోతే, మగవాడు తనే చెప్పిపోగూడదూ?

[రమేష్ మెదలకుండా రాతిబొమ్మలా నిలబడివుంటాడు]

పె. తల్లి—ఏమైనా, బ్రాహ్మలఅబ్బాయి! నౌకర్లు, దాసీలతో ఛీ, పొమ్మనిపించటానికి నా మనసొప్పదు. కాస్త బుద్ధికలిగి సంచరించుకో. పరాయి ఇళ్ళకొచ్చి ప్రేమా-గీమా కబుర్లు చెపుతూ తిరగటానికి నువ్వేం చిన్నవాడివా చితకవాడివా! మా రమ మీ ఇంట్లో అడుగు పెట్టదబ్బాయ్, నేను తెగ్గొట్టి చెపుతున్నాను.

రమే—రమా, అమ్మ నిన్ను 'రాణీ' అంటూండేది. నాకామె మాటే జ్ఞాపకంవుంది. నువ్వు మా యింటికే రాకపోతావని నాకు తెలియదు. రమా, తెలియక నే నేమైనా తప్పుచేస్తే క్షమించు. [అని రమేష్ వెళ్ళిపోతాడు.]

[వేణీ మళ్ళీ ప్రవేశించుతాడు. అతని మొహంలో సంతోషం కన్పించుతుంది.]

వేణీ—బలే, పెద్దమ్మా! బలేగా అంటించావ్! అట్లా అనటం మాకు చాతనవుతుందా? రమా, ఈ పని నౌకర్లు, పని వాళ్ళతో అయ్యేదా! వెధవ మొహంమాడ్చుకొని పోయాడు. బలేపని జరిగింది. నే నంతా చాటునుంచి చూస్తూనేవున్నాలే.

పె త్తల్లి—బాగానే అయిందిగాని, ఈ పని ఆడవాళ్ల మీాద వదిలేసి జారిపోకపోతే నువ్వే చెప్పితే ఇంకా బాగుం. డేది కదూ? అంత చెప్పలేకపోతే పోనీ యెదురుగా వుండి నే నన్నమాటలే విన్నొచ్చుగా!

రమ—పెద్దమ్మా, నువ్వేమీా విచారపడనక్కర్లేదులే. ఈయన వినకపోయినా, నేను విన్నానుగా. ఇంకెవరు ఎలా అన్నా నువ్వుకాకపోతే మరెవరు అంతవిషంకక్కగలరు?

పె త్తల్లి—ఏమిటే అలా అంటావ్?

రమ—ఏంలేదు, ఇవాళ వంట ఏర్పాటేమైనా ఉన్నదా లేదా? వెళ్ళి మునిగిరారాదూ.

[రమ చకచక చెరువువేపుకు నడుస్తుంది]

వేణీ—ఏం పెద్దమ్మా, అసలు సంగతేమిటి?

పె త్తల్లి—ఏమో నాయనా, నా కేం తెలుస్తుంది. ఈ రాజా-రాణీల మనసులు నాలాంటి ము స లి ముండ కేం తెలుస్తాయి.?

[ని ష్క్ర మ ణ

[గోవింద గంగూలీ ప్రవేశం]

గోవిం—అబ్బ! దొరికావూ! వేణీబాబు ఎక్కడెక్కడని ప్రొద్దుటనుంచీ ఊరంతా వెతుక్కొంటున్నాను. కబు

క్షేమైనా విన్నావా ? అబ్బాయిగారు వచ్చిరావటం తోనే నందిగారింటికి పరుగెత్తాడు. నాలుగురోజుల్లోనే పాడైపోకపోతే నన్ను పేరెట్టి పిలవ్వొద్దు. ఆ శ్రాద్ధం జాబితా చూస్తే దంగైపోతావు బాబూ. తారిణీ ఘోషు దబ్బేమీ నిల్వవుంచిపోలేదని నాకు తెలుసు. మరి ఈ ఆడంబరం ఏం చూచుకొనో ! చేతిలో పైసా వుంటే ఖర్చుపెట్టుకోవచ్చు. లేకపోతే మానాలి. ఉన్న ఆస్తి తాకట్టుపెట్టి తండ్రి శ్రాద్ధం ఇంత డాబుగా జరపడం నే నెన్నడూ విన్లేదు. వేణీమాధవబాబూ, నేను నీతో నిజం చెబుతున్నాను, కుర్రాడు నందివద్ద ఏ అయిదువేలో అప్పు తీసుకొనివుంటాడు.

వేణీ—ఆఁ ! గోవిందబాబాయ్ ! అయితే చాలా సంగతులు కనుక్కున్నానన్నమాట!

గోవిం—[చిరునవ్వు నవ్వి] బాబూ, కొంచెం ఓపికపట్టు. నన్ను బాగా దూరనివ్వు, తర్వాత నాడిలోపలిసంగతి కూడా లాక్కొస్తానో లేదో చూడు ! అప్పుడుగాని గోవిందగంగూలీ సంగతి నీకు తెలియదు. ఈలోగా నువ్వనేకం వింటావు. లోకుల కేముంది, అంటించి ఆర్పుతూంటారు. కాని నువ్వు నీ బాబాయిని మెరుగుదువుగా. నీకు నువ్వే ఆలోచించుకో. ఇంతకంటే నే నిప్పుడింకేమీ బయటపెట్టను.

వేణీ—నేను రమవద్దకు వెళ్ళొచ్చాను.

గోవిం—అవును, నాకు తెలుసు. ఏమన్నది?

వేణి—రాము వెళ్ళకపోవటమేగాక తమ సంబంధీకుల నెవర్నీ కూడా వెళ్లనివ్వదు.

గోవిం—చాలు, చాలు. ఇంకేమీ అక్కర్లేదు.

వేణి—కాని, మీరు...

గోవిం—అరె బాబూ, నువ్వు గాభరాపడతా వెందుకు? ముందు నన్ను చోరబడనివ్వు. ముందు అన్నిఏర్పాట్లు బాగా చెయ్యనీ; అప్పుడు చూద్దువుగాని శ్రాద్ధంనాడు ఏమేమి జరుగుతుందో!

వేణి—కాని నే విన్నది...

గోవిం—అయ్యొబాబూ, నీ కెన్నెన్నో చెప్తారు. అనేక మంది లుచ్చాలువచ్చి, అనేకవిధాలుగా చెప్తారు. కాని, నీ గోవిందబాబాయిని ఎరుగుదువుగదూ. చాలు, అంతే!

[ఇద్దరూ నిష్క్రమించుతారు]

—o—

## రెండో దృశ్యం

[రమేశ్ యింటి ముందుభాగం. పూజామందిరంవున్న వరండాలో ఒకవేపున భైరవాచార్యులుకూర్చుని తానులుచించి చాపులుమడతపెట్టి ఒకదాని మీద ఒకటి పెడుతున్నాడు. మందిరం సమీపంలో కూర్చుని గోవిందగంగూలీ చుట్టకాలుస్తూ, తీక్ష్ణంగా చూస్తూ, చాపులు లెక్క పెడుతున్నాడు. నాల్గుప్రక్కలా శ్రాద్ధం ఏర్పాట్లు జరుగుతున్నై. ఎక్కడ చూచినా తత్సంబంధమైన సామగ్రే పడివుంది. చాలామంది వివిధపనుల్లో నిమగ్నులై ఉన్నారు. సమయం పగలు మూడోజాము]

[రమేశ్ ప్రవేశం]

రమేశ్ — [గోవిందగంగూలీతో వినయంగా] మీరు వచ్చారూ! సంతోషం.

గోవిం—ఎందుకు రాను బాబూ! ఇది నా పనేకదూ రమేశ్!

[నేపథ్యంలో ఎవరో దగ్గుతారు. నల్లురెండుగురు బాల-బాలికలను వెంటబెట్టుకుని దగ్గుతూ ధర్మదాస్‌ఛటర్జీ ప్రవేశం. భుజాన మురికిగుప్పటి, ముక్కుమీద పెద్దఅద్దాలకళ్లజోడు—వెనక్కి దారంతో కట్టినది—వుంటాయి. తల పూర్తిగా నెరిసింది. తెల్లబడ్డమీసాలు చుట్టపొగవల్ల ఇత్తడిరంగుగా మారాయి. ముందుకొచ్చి కొంచెంసేపు రమేశ్ మొహంవంక చూచి, బిక్క మొహంపెడతాడు. ఈయన ఎవరో రమేశ్ గుర్తించలేదు. అయినా కంగారుపడి అతనిచేయి పట్టుకుంటాడు.]

ధర్మదాసు—[రమేశ్ తనచేయి పట్టుకోగానే ఏడ్పునాయించి] తారిణీ యిలా మమ్మల్ని అన్యాయంచేసిపోతాడని కలలోకూడా అనుకోలేదు రమేశ్ బాబూ! ఒకరికి జడిసి కల్లబొల్లిమాటలు చెప్పటానికి నే నేమీ అలాంటి ఛటర్జీవంశలో పుట్టలేదు. ఇక్కడికి వస్తూ దారిలో మీ పెత్తండ్రికొడుకు—నీ అన్న వేణీఘోషు మొహంమీదే ఏమనివచ్చానో తెలుసా? 'రమేశ్ బాబు తండ్రి శ్రాద్ధపుఏర్పాట్లు గొప్పగాచేయించడం గొప్ప సంగతేగాని, ఈవిధంగా శ్రాద్ధంజరగడం ఎవరూ చూచివుండ'రని చెప్పాను. బాబూ, వెధవ లెవరైనా వచ్చి నన్నుగురించి నీతో రకరకాలుగా చెప్తారు; కాని ఈ ధర్మదాసు కేవలం ధర్మానికే దాసుడుగాని,

ఇం కెవరికీ దాసుడు కాదని నమ్మం.

[అని గోవిందుని చేతిలోని హుక్కా అందుకొని పీలుస్తాడు. వెంటనే దగ్గుతూంటాడు]

రమేశ్—అబ్బే! మీ రెండు కలా అనుమానించుతారు...

[జవాబుగా ధర్మదాసు బడబడలాడుతూ ఏమేమో చెప్తాడు గాని దగ్గువల్ల ఒక్క అక్షరంకూడా ఎవరికీ తెలియదు. అందరికంటె ముందు అక్కడికి వచ్చింది గోవిందగంగూలీయే. కాబట్టి క్రొత్తజమీందారుగారికి ముఖస్తుతి మాటలు చెప్పే అవకాశం ఆయనకే లభించాల్సివుంది. కాని ఇప్పుడా అవకాశం జారిపోతున్నట్టు కనపడగానే ఆయన చప్పునలేచి నిలబడతాడు]

గోవింద—నిన్న వుదయానే—విన్నావా ధర్మదాస్—ఇక్కడికివద్దామని యింటివద్ద బయల్దేరాను. కాని రాలేకపోయాను. 'గోవిందబాబాయ్, కాస్త చుట్ట తాగి వెళ్ళు' అని వేణీ కేకవేశాడు. మొదట చుట్టకే మెచ్చాలే అనుకున్నానుగాని, తర్వాత అయినా వేణీ మనసులో ఏముందో తెలుసుకోవటమే మంచి దనిపించింది—రమేశ్ బాబూ, ఆయన ఏమన్నాడనుకున్నావ్? "బాబాయ్, మీరంతా రమేశ్ శ్రేయోభిలాషులై పోయారే! ఇంతకీ వాళ్ళింటి కెవరైనా వస్తారనేనా?" అన్నాడు. నేనుమాత్రం ఊరుకేవదుల్తానా! వారు గొప్పవాళ్ళయితే కావచ్చు, మా రమేశ్ బాబు కూడ ఎవరికీ తీసిపోడు. వారియింట్లో ఎవరికేనా పిడికెడు మెతుకులు పెట్టేదుంటేగా అనుకుని "వేణీబాబూ, నాలుగుమెతుకులువచ్చి అక్కడ పేద-సాదల కెల్లా అన్న

దానం జరుగుతుందో చూడరాదూ” అనేశాను. రమేశ్ బాబు నిన్నమొన్నటి పిల్లవాడైతే మాత్రం హృదయమంటే యిదీ!—కాని ధర్మదాస్! ఏమైనప్పటికి మనమేం చేయగలం! ఇదంతా ఎవరిదో ఆయనే చేయించుతున్నాడు. తారిణీబాబు సామాన్యుడా, శాపభ్రష్టుడైన దిక్పతి!

[ధర్మదాసు దగ్గు తగ్గనేలేదు. తనయొనుశే గోవిందు డీ విధంగా క్రొత్త యువక జమీందారుకు ఇచ్చకాలుచెపుతూంటే తా నంతకంటె మరో అడుగు ముందుకు వెయ్యాలని తహతహలాడసాగాడు.]

గోవిం—కాని, బాబూ, నువ్వు నాకే మైనా పరాయివాడివా? నా కెంతో కావలసినవాడివి. మీ అమ్మ నా మేనత్త కూతురికి సయానా మేనకోడలు. రాధానగరం బెనర్జి కుటుంబంలోని ఆడపడుచు. తారిణీఅన్నయ్యకి తెలుసు ఇదంతా. కాబట్టి ఏ కార్యం-కరామతులువచ్చినా, వ్యాజ్యం-వ్యవహారాలకైనా, సాక్ష్యం కావలసొచ్చినా కాకితో కబురంపితే ఈ గోవిందగంగూలీ వచ్చి నీ ముందు వాల్తాడనుకో !

ధర్మ—గోవిందా, ఎందు కీ అనవసర వాగుడు! ఖ-ఖ-ఖ- నే నివాళ్టివాడినా, నే నెరుగని దేముంది? ఆ సంవత్సరం సాక్ష్యానికి పిలిస్తే 'నాకు చెప్పుల్లేవు, ఉత్తపాదాలతో మెలా రాను?—' ఖ—ఖ—ఖ—తారిణి అప్పటికప్పుడు రెండున్నరా ఖర్చుపెట్టి కొత్తజోడ్లుయిప్పిస్తే అవి తొడుక్కొచ్చి వేణీతరఫున సాక్ష్యమిచ్చావు! ఖక్-ఖక్-ఖక్-

గోవిం—[కళ్లెఱ్ఱజేసి] నేను అలా సాక్ష్యమిచ్చానా?

ధర్మ—పోరా అబద్ధాలకోరు!

గోవిం—అబద్ధాలకోరు నీ బాబు!

గోవిం—[పిరిగినగొడుగు తీసుకొని గంతేసి] ఉండు వెధవ! నీపని ... ...

ధర్మ—[పెనుకఱ్ఱ నేలకేసికొట్టి] ఈ వెధవని నేను ఖ—ఖ—ఖ—నరుసక్కు అన్ననే! చూడండి ఈ వెధవ బుద్ధి!

[మళ్ళీ దగ్గుతూంటాడు]

గోవిం—హుఁ, ఈ లుచ్ఛా నాకు అన్నా!

[నలువేపులనుంచీ జనం పరుగెత్తుకువస్తారు. బాల-బాలికలు చకితులై చూస్తుంటారు. రమేశ్ చప్పున వారిద్దరిమధ్యకు వచ్చి నుంచుంటాడు.]

రమే—ఆఁ, ఆఁ, ఇదేమిటి! తమరిద్దరూ పెద్దవారు, బ్రాహ్మణులు, ఈ తగాదా ఏమిటి?

భైరవాచార్యులు—[సమీపించి] పంచెలచాపులు నాలుగు వందలయినై. చాలవూ?

[రమేశ్ మాట్లాడడు.]

భైర—ఛీ! గంగూలీగారూ, మీ కూతలువిని బాబుగారు నిర్విణ్ణులయారు. బాబూ, తమరేమీ అనుకోకండి. ఏదేనా గొప్పకార్యం జరిగే యింట్లో గుద్దులాటలు కొట్లాటలు జరగటం, తర్వాత సర్దుకుపోయి అంతా సవ్యంగాజరిగిపోవటం సహజమేలెండి. ఇకపోనీండి—ధటర్జీగారూ, ఇది చెప్పండి, చాపులు యింతమట్టుకు సరిపోతయ్యంటారా, ఇంకా చించమంటారా?

గోవిం—అవును నిజమే, ఇలా—ఇంతకంటే ఎక్కువే జరుగుతూంటుంది. లేకపోతే గొప్పకార్యమని ఎందుకం

టారు? ఆ సంవత్సరం—నీకు జ్ఞాపకంవుందా భైరవా, యదుముఖర్జీకూతురు రమ పెళ్ళినాడు ఒక చిన్నవిష యానికే రాఘవభట్టాచారి హారాన్ ముఖర్జీలకు ఘర్షణలు పగిలేంతవరకు జరిగింది. కాని, నే నొకటి చెప్తు న్నాను భైరవా, మన రమేశ్ బాబుచేస్తున్న ఈ పని బాగుండలా. హీనజాతివాళ్ళకీ విధంగా పంచెలు పంచిపెట్టటం బూడిదలోపోసిన పన్నీటితో సమానమే. ఇంతకంటె బ్రాహ్మలకు జత, పిల్లలకు ఒక్కొక్క పంచె యిస్తే మంచిపేరు వస్తుంది. ఇలా చెయ్యాట మేం బాగుంటుంది. ఏం ధర్మదాస్! నీ వుద్దేశ్యం ఏమిటి?

ధర్మ—[రమేశ్ తో] బాబూ, గోవిందుడు తప్పేమీ చె ప్పలా. వాళ్ళ కివ్వటం వ్యర్థమే. శాస్త్రాలలో వాళ్ళని నీచులని ఎందుకుచెప్పారు? ఏం రమేశ్ బాబూ, తెలిసిందా?

రమేశ్—ఆ ఆ, తెలియకేం.

భైర—అయితే చించినవాటితో పనవుతుం దంటారా?

రమే—నేను చాలవనే అనుకుంటున్నాను. పేద-సాద లెంత మంది వస్తారో ఇప్పుడేమీ చెప్పలేము. కాబట్టి మీ రింకా రెండువందల చాపులు సిద్ధంచేసి వుంచ డమే మంచిది.

గోవిం—మరి లేకపోతే ఎలా సరిపోతాయి!— పదవయ్యా, ఒక్కడివే ఎన్నని చించుతావ్. పద, నేనూ వస్తాను.

[అని గోవిందుడు బట్టల కుప్పను సమీపించుతాడు. ఇదే అవకాశ

మసలకుని ధర్మదాసు రమేషును ఒకప్రక్కకులాక్కెళ్ళి, ఆతని చెవిలో గుసగుస లాడుతాడు. అక్కడ గోవిందుడూ తలెత్తి క్రీగంట వీరివేపే చూస్తుంటాడు.]

ధర్మ—బాబూ, ఈ వూళ్ళు మహా చెడిపోయినై. భాండా రపుకొట్టు ఎవరికిపడితే వారికి అప్పగించి నమ్మేవ్! ఉప్పూ-పప్పూ, నూనె, నెయ్యి చేతికి అందినమట్టుకు జేరవేసు కుంటారు. ఇప్పుడే పోయి మీ మేనత్తని పంపుతాను. నీది పూచికపుల్లయినా పోనివ్వదు.

[గడ్డం, మీసం సున్నగా గొరిగించుకుని బక్కపల్చగావున్న దీనానాథ్ భట్టాచారి ప్రవేశం. ఆయనతో ఇద్దరుముగ్గురు పిల్లలుకూడ వస్తారు. పిల్ల లలో పెద్దది-ఆడపిల్ల చిరిగిపోయి చీరలగుడ్డ కట్టుకున్నది.]

దీనానాథ్—బాబుగా రెక్కడ?

గోవిం—[లేచి] రా దీనూ, కూర్చో. ఇవాళ ఇక్కడ నీ పాదంసోకడం మా అదృష్టం! పాపం! అబ్బాయి ఒంట రిగా సతమత మవుతూంటే మీరు ... ...

[ధర్మదాసు వీరివంక మిరిమిరిచూస్తాడు]

గోవిం—అయితే, మీరు యిక్కడికి రారాయేం?

దీనా—నేను వూళ్ళో లేనయ్యా. మా కోడలిని తీసుకురావ టానికి మామగారి వూరు వెళ్ళాను. బాబుగారు ఏరీ? చాలా గొప్పఏర్పాటు జరుగుతోందని విన్నానే. భోంచేయబెట్టిన తర్వాత వచ్చిన పిల్లలకీ, వృద్ధులకూ— అందరికి పూరీలు లడ్లుకూడ పంచిపెడతారని వచ్చేట ప్పుడు సంతవద్ద చెప్పుకుంటున్నారే!

గోవిందు—[స్వరం తగ్గించి] అంతేనా; తల కొక పంచె కూడ యిస్తారు. అబ్బాయ్ దీనూ, ఈయనే మన రమేష్.

మీ నలుగురి ఆశీర్వాదంవల్ల ఎలాగో ఎర్పాట్లన్నీ చేస్తూనే వున్నానుగాని, వేణి చేతులుముడుచుకుని బిడాయించుకున్నాడు. అరె, నాకే రెండుసార్లు కబురు పంపితే! రమేశ్‌తో రక్తసంబంధంవుంది కాబట్టి నా సంగతి వదిలెయ్. కాని ఈ దీనా కబురు తెలియగానే పరుగెత్తుకువచ్చేశాడు. ఒరే, షష్టీచరణ్! పుగాకు తీసుకురారా. రమేశ్ బాబూ! కాస్త యిలా రా, ఒక మాట చెప్పాలి.

[నౌకరువచ్చి దీనా చేతికి హుక్కా యిచ్చిపోతాడు. గోవిందుడు రమేశ్‌ని మరోవేపుకు లాక్కుపోతాడు.]

గోవిం—బహుశ లోపలికి ధర్మదాసుపెళ్లాం వస్తుందేమో. జాగ్రత్త బాబూ, చాలా జాగ్రతగావుండాలి! ఆ మాయబ్రాహ్మడు తీపిమాట లెన్ని చెప్పినా, సామాను కొట్టు ఆ ఆడుదానిచేతికి అప్పగించేవు సుమా. ఆ నీచురాలు సగానికి సగం దోచేస్తుంది. అయినా నీకు దిగులెందుకు బాబూ! మీ అత్త వుండ నేవుందిగా. నే నిప్పుడే వెళ్ళగానే పంపుతాలే. ఆమె అంతా తనదే ననుకొని జాగ్రత్తగావున్నట్టు మరొకరివల్లవుతుందా?

[ఇద్దరు పిల్లలు వచ్చి దీనా భుజాలకు వ్రేలాడుతారు.]

పిల్లలు—అయ్యా, లడ్డూలు తింటామే.

దీనా—[రమేశ్ వేపొకసారీ, గోవిందునివంక ఒకసారీ చూచి] లడ్డూలెక్కడివిరా? ఇక్కడెక్కణ్ణుంచి తెమ్మంటార్రా?

[దీనాకూతురు వ్రేలితో లోపలికిచూపుతుంది]

పిల్ల—అయ్యో, అవేఁ, అటు చూడు.

[తతిమ్మాపిల్లలు ధర్మదాసును చుట్టుకొని మాకూ కావాలి అంటారు]

రమేశ్—[ముందుకొచ్చి] మంచిది తెప్పిస్తానుండండి. ఆచార్యులుగారూ. పాపం, పిల్లలు ఆకలిగొనివుంటారు. [లోపలనుంచునివున్న వంటమనిషితో] ఏయ్. నీ పేరేమిటి? వెళ్ళి పళ్లెంతో లడ్లు తీసుకురా. ఆచార్యులుగారూ, త్వరగా తెప్పించండి.

[భైరవాచార్యులు లోపలికివెళ్తాడు. వెంటనే వంటమనిషి లడ్డూలు తెస్తాడు. పిల్లలంతా పళ్లెంమీద విరుచుకుపడి ఎవరికి పంచిపెట్టడానికీ వీల్లేకుండా విసిగిస్తారు. పిల్లలు తింటూంటేచూచి దీనానాథునికి నోరూరుతుంది.]

దీనా—ఒసేయ్ సుందా, లడ్డూ తింటున్నావు సరేగాని, ఎలావుందో చెప్పవేమే?

సుంద—చాలా బాగుంది! [తింటూంటుంది]

దీనా—[నవ్వి తలాడించుతూ] ఆఁ, మీ మొహాం, పాకం కుదిరిందీ లేనిదీ మీ కేం తెలుసు? తియ్యగావుంటే చాలు, బాగుందనేస్తారు మీరు. [వంటాయనతో] ఏమయ్యో, ఇప్పుడే వండేశావేఁ? ఏఁ గోవిందబాబూ, ఇంకా వ్యవధివుందిగా, మీకు తెలియదూ?

వం. మ—అవునండీ, ఇంకా వ్యవధివున్నది. కాని ఇవి సంధ్యాపూజ... ...

దీనా—సరే, ఒక లడ్డూ గోవిందబాబు కివ్వు; రుచిచూచి మీ కలకత్తా పనివాడితనం ఎలాంటిదో—

[వంటమనిషి, గోవింద్, దీనానాథు లిద్దరికి లడ్లు ఇవ్వబోతాడు]

దీనా—ఎబ్బెబ్బె! నా కెందుకు? అంతెందుకయ్యా, సగంచాల్లేఁ

ఎక్కువ వద్దు. [హుక్కా క్రింద పెట్టేసి] ఒరే షష్టీ చరణ్! కాసిని నీళ్ళు పట్టుకురా. చేతులు కడుక్కుంటాను.

రమేశ్——[లోపలికి చూస్తూ] షష్ఠీ, నాలుగైదు విస్తళ్ళు తీసుకురారా.

గోవిం——లడ్లు చూస్తేనే బాగా కుదిరాయని తెలుస్తోంది. ఏమయ్యా వంటాయనా, కొంచెం లేతపాకం పట్టావల్లే వున్నదే.

వం. మ——అవునండీ, ఈ పాయ కొంచెం లేతపాకమే.

గోవిం——[నవ్వి] అరె, మాకు తెలియదూ. వంటింట్లోకూడా ఏది ఎలా తయారైందో చెప్పేస్తాను.

వం. మ——తమకు తెలియకపోతే ఎవరికి తెలుస్తుందండీ!

[షష్ఠీచరణుడు, మరో నౌకరు విస్తళ్ళు, మంచినీళ్ళ గ్లాసులు తెస్తారు. వంటమనిషి బ్రాహ్మణులందరికి లడ్లు వడ్డించుతూంటాడు. ఎవరూ వద్దనీ, కద్దనీ మాట్లాడరు. బాల-బాలికలు, ధర్మదాసు, దీనానాథ్, గోవింద్ అందరూ తిననారంభించుతారు. చూస్తూ చూస్తుండగానే పళ్ళెం ఖాళీ అయిపోతుంది.]

దీనా——ఆః, కలకత్తామనిషి వంటే వంట! ఏం ధర్మదాస్ బాబూ, అంతేకదూ?

[లడ్డూ మ్రింగుతూన్న ధర్మదాసుగొంతులోంచి మాట సరిగా బయటికి రాదు. కాని దీనానాథునితో ఏకీభవించుతూన్నట్టుమాత్రం తెలిసిపోతుంది.]

గోవిం——[ప్రాపిరి ఎగబీల్చి] నిజంగా అరిందాచెయ్యంటే నీదేనయ్యా!

వంట—బాబూ, ఎలాగూ శ్రమతీసుకున్నారు, ఆ చేతుల్తోనే కాస్త రవ్వలడ్లుకూడ రుచిచూడండి.

దీనా—రవ్వలడ్డూలా! ఏవీ, తే చూద్దాం.

వం. మ—ఇదిగో, క్షణంలో తెస్తాను.

[రెప్పపాటులో వంటవాడు రవలడ్లు తీసుకువచ్చి బ్రాహ్మణులకు వడ్డిస్తాడు. ఆ ప్లేటు ఖాళీ అవటానికూడ ఎంతోసేపుపట్టదు.]

దీనా—[తనకూతురువేపు చేయిజాపి] సుందా, తీసుకోఅమ్మా. ఈ రెండూ తీసుకో.

సుంద—వద్దు నాన్నా, ఇక నేను తిన్లేను.

దీనా—తినొచ్చులేవే. ఒకగుక్కెడు మంచినీళ్లుతాగి గొంతు తడుపుకో; తిన్లేకపోతేపోనీ చెంగులో కట్టుకో, రేపు ప్రొద్దున్నే తిందువుగాని.

[బలాత్కారంగా పిల్లచేతిలో పెడతాడు.]

దీనా—[వంటమనిషితో] ఇదీ భోంచేయబెట్టటమంటేను! అమృతంలా గున్నాయి. చాలా బాగావున్నై లే. [రమేశ్‌తో] ఏంబాబూ, రెండురకాలు చేయించారన్నమాట?

వం. మ—కాదండి, రసగుల్లా, మోహన్‌ఖీర్ ...

దీనా—ఆఁ! మోహన్‌ఖీర్ కూడానా? ఏదీ? నువ్వది తేనేలేదే. [రమేశ్ వంక విస్మితుడై చూస్తూ] ఒకసారి రాధాపురం బోసుగారి యింట్లో తిన్నాను. ఇప్పుడే నాలుకమీద వేసుకున్నట్టుంది. నువ్వు నమ్ముతావో లేదోగాని బాబూ, మోహన్‌ఖీర్ అంటే నాకు మహాయిష్టం.

రమేశ్—[నవ్వి] ఇందులో నమ్మకపోవటాని కేమున్నది లెండి—ఒరేయ్ షష్ఠీ! చూడు, లోపల ఆచార్యులు గారు వున్నారేమో, వారితో చెప్పి కాస్త మోహాన్ ఖీర్ తెమ్మని.

[షష్ఠీచరణుడు వెళ్తాడు]

గోవింద—అరె, పిండివంటకాలన్నీ జాగ్రత్తగా దాచలేదూ? ఇదేం బాగులేదు బాబూ.

ధర్మ—గదిలో పెట్టి తాళం వేశారులే. తాళంచెవి ఎవరి దగ్గరవున్నదో?

గోవిం—ఆ భైరవాచార్యుడివద్దే లేదుగద!

షష్ఠీ—[వచ్చి] బాబూ, ఇప్పుడు గదితలుపులు తెరవటానికి వీల్లేదటండీ. మోహాన్ ఖీరు తేవటానికి వీలుపడదు.

రమేశ్—పోయి నేను తెమ్మన్నానని చెప్పరా.

గోవిం—చూచావా ధర్మదాస్, ఈ ఆచార్యులుబుద్ధి. 'కంద కులేని దురద చేమ' కన్నట్టుంది. అందుకనే నే చెప్పేది...

షష్ఠీ—ఇందులో ఆయన దేమున్నదండీ. ఆ అమ్మగారు వచ్చి సామగ్రిగదికి తాళంవేసి, చెవిని కొంగుకు కట్టుకున్నారు. ఇప్పుడు వీల్లేదని చెప్పింది వారే.

ధర్మ-గోవిం—ఎవరూ వచ్చింది! వేణీబాబు తల్లిగారా?

రమేశ్—పెద్దమ్మ వచ్చిందా?

షష్ఠీ—అవునండీ. వారు రావటంతోనే పెద్ద-చిన్న సామాను గదులు రెండింటికీ తాళాలువేశారు. తాళంచెవులు వారిచెంగుకే కట్టుకున్నారు.

గోవింద—చూచావా ధర్మదాసు ఏం జరుగుతున్నదో? ఉద్దేశ్యం గ్రహించావుకదూ?

దీనూ—అయ్యో బాబూ, యిందులో ఏమంత కష్టమున్నదయ్యా తెలుసుకోలేకపోవటానికి? తాళంబిగించి, తాళంచెవి దగ్గర వుంచుకున్నారు! అంటే సామాను ఎవరిచేతికీ చిక్కకుండాను! ఆమెగారికి అంతా తెలుసు గదూ!

గోవింద—ఏమీ తెలియనివాడివి అల్లావుండక నువ్వు మాట్లాడుతావెందుకయ్యా? నీకీ సంగతులన్నియేం తెలుసని, తెయ్యిమంటూ అర్థాలు చెప్పొచ్చావు?

దీనూ—అరరె, ఇందులో మహా తెలియనిసంగతి ఏముందీ? అమ్మగారు స్వయంగానే వచ్చి తాళాలువేశారని వింటున్నారుకద! దీనికి యింకెవరు మాత్రం ఏంఅర్థం చెప్పగలరేమిటి?

గోవింద—భట్టాచార్యా! ఇంక యింటికిపోరాదూ. ఇంటిల్లిపాదీ పరుగెత్తుకొని వచ్చినపని అయిందిగా; అందరూ తిననూ తిన్నారు; మూటలుకూడ కట్టుకున్నారాయె; మాకు చాలా పనులున్నై.

రమేశ్—గంగూలీగారూ, యిదేంపనండీ? ఎవర్నిపడితే వారిని మీ యిష్టంవచ్చినట్లు అవమానించుతున్నారేమిటి?

[గోవిందగంగూలీ యీ అదలింపుతో కొంచెం సిగ్గుపడుతాడు. లేని నవ్వు తెచ్చిపెట్టుకొని పుక్కపోసంతో]

గోవింద—అయ్యో బాబూ, నేనెవర్ని అవమానించాను? నేను చెప్పుతున్నది నిజమవునో కాదో కాస్త ఫీరిని

అడిగిచూశాను. అతడు కొమ్మకొమ్మకూ తిరిగితే
నేను ఆకుఆకుకీ తిరుగుతాను. చూచావా ధర్మ
దాసూ, యీ దీనూ సాహసం! సరే—"

రమేశ్—'సరే' అంటే!

దీనూ—[రమేశ్ తో] కాదుబాబూ, ఆయన చెప్పింది
నిజమే. నేను నిరుపేదనని అందరూ యెరిగినదే.
వీరికివలె నాకుభూమీ-పుట్రా ఆస్తీ-గీస్తీ లేవు. అక్కడా
యిక్కడా అడుక్కు తెచ్చుకొని ఎలాగో వెళ్ళబుచ్చు
తున్నాను. పిల్లా-జెల్లలకు మంచిమంచి తినుబండా
రాలుపెట్టగల శక్తి దేవుడు నా కివ్వలేదు. ఇందు
వల్లే గొప్పవారియిండ్లలో ఏ కార్యం - కరామతు
లొచ్చినా అక్కడికిపోయి తిని సంతుష్టిచెందుతున్నాము.
బాబూ! మీరు ఏమీ మనసులో పెట్టుకోకండి. తారిణీ
బాబు వున్నంతకాలం మమ్మల్నిపిల్చి భోంచేయు
బెడుతూండేవారు.

[అందరికేసి చూస్తూంటే దీనూ కళ్ళనుండి అశ్రుబిందువులు రాలిపడ
తాయి. దీనూ తన మురికిపంచెతో కళ్ళు తుడుచుకుంటాడు.]

గోవింద—వహ్వా! బలేగా చెప్పావ్! తారిణీబాబు నీ ఒక్కణ్ణే
పిలిచి పెట్టేవాడా! ధర్మదాస్ అన్నా! ఈయన మాటలు
వింటున్నావా?

దీనూ—ఓయి గోవిందా! నే నేం తప్పుచెప్పాను? నావంటి
బీదా-బిక్కీ ఎన్నడూ తారిణీబాబుయింటినుంచి ఉత్త
చేతుల్తో తిరిగిపోలేదనేగా నే చెప్పింది.

రమేశ్—భట్టాచార్యగారూ! ఈ రెండురోజులూ తమరు తప్పకుండా దయచెయ్యాండి. అమ్మగారుకూడా మా యింటికి దయచేస్తే నా భాగ్యమనుకుంటాను.

దీనూ—రమేశ్ బాబూ, నేను చాలా బీదవాణ్ని. కష్టాల్లో వున్నవాడిని. నువ్విలా అంటూంటే నేను సిగ్గుతో చచ్చిపోతున్నాను.

నౌకరు—[ప్రవేశించి] బాబూ, అమ్మగారు తమర్ని లోపలికి పిలుస్తున్నారు.

రమేశ్—సరే, వస్తున్నా.

దీనూ—అయితే యిక మేము వెళ్తాం బాబూ.

రమేశ్—మంచిది. కాని నా ప్రార్థన మరచిపోకండేం.

దీనూ—లేదు బాబూ. ప్రార్థన అంటావేం నాయనా, ఇది నీ దయ. [అని పిల్లలతో నిష్క్రమింపుతాడు]

గోవింద—రమేశ్ బాబూ, మరి నేనుకూడా వెళ్తాను; సంధ్యావందనం, దేవతాపూజ...

రమేశ్—కాని, గంగూలీగారూ...

గోవింద—అయ్యబాబూ! నువ్వు చెప్పాలా? ఇది మా పనే. నువ్వు పిలవకపోయినా మా అంతట మేమే వచ్చి పని సానుకూలంచెయ్యాలి. రేపుప్రొద్దున్నే మీ అత్తను ఇక్కడికి పంపినతర్వాతగాని నాకు నిశ్చింతగావుండదు, సరేనా?

ధర్మ—గోవిందా, నువ్వు అనవసరవిషయాలు చాలా మాట్లాడుతున్నావు.

గోవింద—నువ్వేమీ చింతించనక్కర్లేదు రమేశ్. సామానుు పదార్థాలు అన్నీ...

ధర్మ—భేష్, సామాను వగైరానుగూర్చి నీ కెంత శ్రద్ధా యెందుకయ్యా? ఆ యేర్పాటంతా నేను ముందే చేసి వేశానులే.

గోవింద—బాబూ, యిది మా స్వంతపనేనయ్యా. నేనూ, ధర్మదాసూ నువ్వుపిలిచేదాకా చూస్తూకూచున్నామా? మేము రాలేదూ? ఏం బాబూ?

ధర్మ—చూడు రమేశ్, మే మేమీ వేణీఘోషాలులం కాము. మేము లోల్లీ మనుష్యులం కాదు సుమా.

రమేశ్—అరే, మీరిలా మాట్లాడుతున్నా రేమిటి?

[రమేశ్ పెత్తల్లి తలుపుచాటునుంచి తల ముందుకు పెట్టి చూచింది.]

పెద్దమ్మ—రమేష్, వీరు ఇలాగే చెపుతూంటారులే. చదువూ—సంధ్యాలేవు సరిగదా, సత్సాంగత్యంకూడా లేదు. కాబట్టి తా మేమి వాగేదీ తమకే తెలియదు.

[గోవింద, ధర్మదాసుల నిష్క్రమణ]

రమేశ్—పెద్దమ్మా!

పెద్దమ్మ—అవున్నాయనా, నేనే. నన్ను ఆనవాలుపట్టావా?

[అంటూ ఆమె ముందుకివచ్చి నుంచుంటుంది. ఆమెవయస్సు యాభైకి తక్కువవుండదు. అయినా చూపులకు నలభైకిమించి నట్టుండదు. ఆమె జుట్టు కురుచగా కత్తిరించబడివున్నది. ఒకప్పు డీ ప్రాంతంలో ప్రసిద్ధిచెందిన ఆమె సౌందర్యం ఇప్పటికీ పుష్టివంతమైన ఆమెదేహాన్ని విడిచిపోలేకపోయింది. నేటికీ ఆమెఅవయవాలు చతురకళారాధననికృషిఫలితమా అనిపిస్తున్నవి.

రమేష్—చిన్నప్పటినుంచి నీచే పెంచబడినవాడ్నే, చదువుకొని యింటికివచ్చి నిన్ను గుర్తించలేడనుకుంటున్నావా పెద్దమ్మా?

పెద్దమ్మ—లేదు రమేశ్! నాకా సందేహం లేదుకాని, నువ్వింకా నీ పెద్దమ్మని మరచిపోలేదని నీ నోటి విూదుగా వినాలనే అలా అన్నానులే.

రమేష్—లేదు పెద్దమ్మా! నాకు బాగా జ్ఞాపకంవుంది. నువ్వంటే గౌరవమూవుంది. కాని, ఏదో చేయగలిగినది నేనే చేసుకునేవాడినిగా; ఇక్కడికిరావటానికి నువ్వెందుకు శ్రమతీసుకున్నావు పెద్దమ్మా?

పెద్దమ్మ—బాబూ, నువ్వు పిలిస్తే రాలేదుగా నేను, నీకు సంజాయిషీ చెప్పటానికి.

రమేశ్—పిలిచి యెలా తీసుకురాగలను పెద్దమ్మా? అమ్మవని అందరికంటెముందు నీ ఒడిలోకే పరుగెత్తుకు వచ్చాను. కాని, పెద్దమ్మా!—ఇంట్లో లేవని చెప్పించావు. నా కంటికే కన్పడకపోతివి!

పెద్దమ్మ—అందుకనే, నువ్వు అలిగి కోపంతో నన్ను నీ ఇంట్లోనుంచి పంపెయ్యాలనుకుంటున్నావా రమేశ్?

రమేశ్—నాకు కోపమంటున్నావా? తల్లీ తండ్రీ లేక, స్వగ్రామంలో నిరాశ్రయుడై, పరాయివాడై పోయిన వాడి, యితరుసహోదరులు వారే గాక, ఆత్మీయులచేకూడ తమ గడపలోంచి తరిమేయబడుతున్నవాడికోపానికి విలువేముంటుందో నువ్వే చెప్పు పెద్దమ్మా!

పెద్దమ్మ—ఏం రమేశ్, నాముందుకూడా దాని కేమీ విలువ లేదా ?

రమేశ్—లేదు, లేదు. ఇవాళ నువ్వు నీ కన్నకొడుకునే కొడుకుగా యెంచావు. ఒకప్పుడు తల్లిలేని పిల్లవాడినికూడా నీ బిడ్డలాగే పోషించి పెంచావని మర్చిపోయావు.

పెద్దమ్మ—ఏం రమేశ్, నువ్వింకా యిలాగే చెప్పిపోవవ దలిచావా? నేను యింటా, బయటాకూడా ఈవిధంగా శిక్ష అనుభవించటానికేనా మి మిద్దర్నీ పెంచి పెద్దవాళ్ళనుచేసింది ?

రమేశ్—ఇంటా బయటాకూడానా? అలాగే కనిపిస్తోంది ! [తటాలున ఆమె పాదాలవద్ద మోకరిల్లి] పెద్దమ్మా ! నన్ను క్షమించు. నాలో మండుతున్న మంటవల్ల నీ స్థితిని కన్పెట్టలేకపోయాను.

పెద్దమ్మ—[రమేశ్‌ని లేవనెత్తి, కుడిచేత్తో ఆతని చుబుకము పట్టుకొని] అవును నాయనా, నాకు తెలుసు.

రమేశ్—కాని నువ్వింక ఈ యింటికి రావద్దు. నే నేదైనా సహించుతానుగాని నా గురించి నువ్వు దుఃఖింపొందటం నేను సహించలేను పెద్దమ్మా !

పెద్దమ్మ—అలాకాదు రమేశ్ ! దుఃఖంసహించటమే కర్తవ్యమైతే—అది నేనూ సహించగలను, నువ్వూ సహించుతావు. ఒకవేళ మోసగించి సుఖం పొందటానికి ప్రయత్నించితే, దాని బీజంలోనుంచి మరింత దుఃఖమే వచ్చిపడుతుంది నాయనా! నన్నాపాలని నువ్వేనా

ఆలోచించవద్దు, నువ్వు అడ్డు చెప్పినా నే నెందుకు వింటాను!

రమేశ్—పెద్దమ్మా, నిన్ను మరచిపోయి నేను వద్దనబోయాను. ఇంక నువ్వు నా మాట వినక, నీకు మంచి దని తోచినట్టే చెయ్యి, సరేనా?

పెద్దమ్మ—ఆఁ, అలాగే చేస్తాన్లే.

రమేష్—ఆఁ ఆఁ, అలాగే చెయ్యి. ఎన్ని తుపానులు, ఎన్ని కష్టాలు నీపైగా దాటిపోయాయో! ఆ వార్తలన్నీ దూరానవున్నా అప్పుడప్పుడు నాకు తెలుస్తూనేవున్నై. కాని నిన్నెవరూ మార్చలేకపోయారు. ఎన్నటికీ ఆరని ఆ తీవ్రాగ్నిజ్వాల నీలో భగభగమండుతూనే వుంది.

పెద్దమ్మ—చాల్ చాలు, ఇంక ఆపు. చిన్ననోట పెద్దమాటలు అనమాకు. సరేగాని, నువ్వు మా అన్నయ్యనుకూడ పిల్చావా, చెప్పు!

[రమేశ్ తలవంచుకొని మౌనంగా వుంటాడు]

పెద్దమ్మ—ఇంట్లో లేడనిపించి వాడు నిన్ను కలుసుకోలేదుకదూ!

[రమేశ్ యిప్పుడుకూడ మౌనంగానే వుంటాడు.]

పెద్దమ్మ—అయినా మళ్లీ ఒకసారి—[కొంచెమాగి] వాడికి నీ వంటే యిష్టంలేదని నాకు తెలుసు. కాని నీ పని నువ్వు చేసితీరాలి. వాడు అన్నగదా. వానిముందు తలవంచడానికి సిగ్గెందుకు! అదీగాక—నాయనా!—అయినవాళ్ళు, కానివాళ్ళ కాళ్లూచేతులూ పట్టుకొని

తగాదాలుమాపుకోవాల్సిన సమయం ఇది. ఇదే మానవ ధర్మం. నాబిడ్డవు కదూ, మరొకసారి వాళ్ళని పిల్చిరా బాబూ. ఇప్పుడు యింటివద్దే వుంటాడు.

రమేష్—పెద్దమ్మా! నువ్వు వెళ్లమంటే తప్పకుండా వెళ్తాను.

పెద్దమ్మ—మరోమాట. ఒకసారి రమ ఇంటికికూడ పోయి రా.

రమేష్—వెళ్లొచ్చాను.

పెద్దమ్మ—వెళ్ళావా? ఆమె నిన్ను గుర్తుపట్టిందా?

రమే—ఆ, గుర్తించిందనుకుంటాను. లేకపోతే నన్నవమానించి యింట్లోనుంచి ఎందుకు వెళ్లగొడుతుంది?

పెద్దమ్మ—అవమానించి వెళ్ళగొట్టిందా? రమే!

రమే—ఆ అవమానించటంతో తృప్తితీరలేదు గాబోలు, మరొకసారి వాకిట్లో అడుగుపెడితే దర్వానుతో గెంటిస్తాననికూడా చెప్పింది.

పెద్దమ్మ—రమ తననోటితోనే అన్నదా ఈ మాటలు? నేను స్వయంగా విన్నాకూడ నాకు విశ్వాసంకలుగదురా అబ్బాయ్.

రమేష్—పెద్దమ్మా, అన్నయ్యకూడ అప్పుడక్కడే వున్నాడు. ఆయన్నే అడుగు, చెప్తాడు

పెద్దమ్మ—వేణీకూడ వున్నాడా? అయితే అలా జరిగివుండడం సంభవమేలే. [కొంచెమాగి] మళ్లీ యింటికివస్తే దర్వానుతో గెంటిస్తానని రమ అన్నమాట నిజమేనా అబ్బాయ్? నన్ను మాయలో పెట్టక సరిగా చెప్పు?

రమే—అన్నను పెద్దమ్మా, నిజమే. కాని, తననోటితో చెప్పక, ఎవరో సవతితల్లి అట—ఆమెతో చెప్పించింది.

పెద్ద—[విచారంగా నిట్టూర్చి] ఓహో, అలా చెప్పు! అలా కాకపోతే, రాత్రీ, పగలూ కూడ కల్లే అయిపోతాయి. ఆమె మెడమీద కత్తిపెట్టి చెప్పమన్నా, యింత కటువుగా నీతో ఎన్నడూ చెప్పలేదు. అయితే ఈమాట ఆమె సవతితల్లి అన్నదన్నమాట, ఆమె కాదుగా.

రమే—అయితే నన్నామె యింటికూడ వెళ్ళమంటావా పెద్దమ్మా! రమసంగతి బాగా తెలుసా?

పెద్ద—బాగా యెరుగుదును. కాని ఇప్పుడు నిన్ను వెళ్ళమననులే! మీ నాన్నగారికీ ఆమెకూ చాలా వ్యాజ్యాలు, వ్యవహారాలూ నడిచాయి. ఆమె నీకు విరోధిఅన్నా అందులో అబద్ధమేమీ వుండదు. అయినా, ఆ మాట రమ అనజాలదని నాకు తెలుసు. నాయనా, అలాంటి పిల్ల లక్షలు, కోట్లమందిలో వెదకినా దొరకదు. ఆమె ఉండబట్టే యింకా ఈ వూళ్ళో కాస్తో కూస్తో ధర్మం నిలిచివుంది.

రమే—కాని ఆమెను చూచినాక అలా అనిపించలేదే నాకు.

పెద్ద—యిప్పుడు రాలేకపోవచ్చు కాని, — రమేశ్ — నేను చెప్పిందిమాత్రం నిజం. అయినా అక్కడికి వెళ్ళడమనే మాటే లేనప్పుడు ఆ విషయంలో చింతించి ప్రయోజనం లేదు. కాని, బిడ్డా! ఇంతవరకు యిక్కడ వున్నావే— నాటిమాత్రంను వ్వెన్నడూ మరువకు సుమా. నా రంజన్ని నేను బాగా యెరుగుదును.

రమే — కాని—పెద్దమ్మా—ఈ ఆపత్సమయంలో నాకు అందరి కంటె కావలసినవారు వారేనే. నేను వారిని విశ్వసించకపోతే ఇం కెవర్ని నమ్మేది?

పెద్ద—బిడ్డా, ఈ మాటకే ఏం జవాబు చెప్పాలా అని ఆలోచించుతున్నాను. సరేగాని, ఎవ రెవర్ని పిలవాలో జాబితా తయారయిందా?

రమే—లేదు, యింకా తయారు కాలేదు.

పెద్ద—చూడు రమేశ్, కాస్త వెనకాముందూ ఆలోచించి జాబితా తయారుచెయ్యి. ఈ వూళ్ళో—కాదు, అన్ని వూళ్ళల్లోనూ ఇంతే. వారు వీరితో కూచుని తినరు; వీరు వారితో మాట్లాడరు. ఎప్పుడేనా ఎవరింట్లోనో ఏదేనా కార్యంవస్తే ఇంక వారి గుంజాటనకు అంతుండదు. ఎవర్ని పిలవాలి, ఎవర్ని వదలాలి అని నిర్ణయించుకోవట మంత కష్టమైనపని వేరొకటివుండదు.

రమే—మరి ఇలా ఎందుకు జరుగుతోంది పెద్దమ్మా?

పెద్ద—నాయనా, దీనికి చాలా కారణాలున్నై. ఇక్కడే వుంటే అన్నీ నీకే తెలుస్తాయి. నిజంగానే ఒక్కొక్కరి దోష మొ, అపరాధమో వుంటుంది. ఒక్కొక్కరికి లేనిపోని నింద, అపకీర్తి వచ్చిపడుతై. వ్యాజ్యాలు, వ్యవహారాలు, తప్పుడుసాక్ష్యాలవల్లకూడ ముఠాలు యేర్పడినై. రమేశ్, నేను మరి రెండురోజులు ముందు వచ్చివుంటే నిన్నిన్ని యేర్పాట్లుచేయనిచ్చేదాన్ని కాదు. ఇంతకూ ఆవాళ ఏంజరుగుతుందో

వనే నాకు దిగులుగావుంది. [అని ఆమె నిట్టూర్పు తుంది]

రమేశ్—పెద్దమ్మా. నీ నిట్టూర్పుకు అర్థం గ్రహించడం కష్టమే. కాని నాకు దీనితో సంబంధం లేదు. నన్ను పరదేశి గానే యెంచుకోవాలి. నాకెవరితోను విరోధమూ లేదు; నాకే మతంతోను ఐక్యమూ లేదు. ఎవరి వల్లా నాకెలాంటి అవమానం జరగటానికీ వీల్లేదు. నేను అందరినీ గౌరవ-మర్యాదలతో పిల్చుకొస్తాను.

పెద్ద—ఆ, అదే మంచిది. కాని, ఏదైనా నలుగుర్నీ సంప్ర దించి చెయ్యి నాయనా! లేకపోతే గడబిడ అయిపో తుంది—తల్లీ ఆపద్బాంధవీ!

రమే—అయితే నువ్విప్పుడే వెళ్ళిపోతున్నావా?

పెద్ద—లేదు, ఇప్పుడే వెళ్ళనులే. యింకా ఒకటి రెండు పనులు వున్నై. వాటిని పూర్తి చేసే వెళ్తాను. కాని, తాళం చెవులు నాదగ్గర వుంటాయిలే రమేశ్. రేపు ప్రొద్దున్నే వచ్చి నేనే సామగ్రిగదులు తెరుస్తాను.

[నిష్క్రమణ]

[ధర్మదాసు, గోవిందుడు, పరాన్‌లు ప్రవేశం]

గోవిం—[రమేశ్‌తో] బాబూ, చూచావా, ఈ పరాన్ మామని ఎల్లాగో పట్టుకులాక్కొచ్చాను. ఇతడు మన యింటికి వస్తాడా? కాని నేను వదలిపెడతానా? ఒక్క వేణీయే జమీందారా యేం? మా మేనల్లుడు రమేశ్

మాత్రం జమీందారు కాదా అన్నాను. [పైకిచూచి] తారిణీబాబూ! నువ్వు స్వర్గంలో కూచుని అంతా చూస్తూనేవున్నావుగా, నీముందే చెప్తున్నాను:, ఆ వేణీని ఈ వాకిట్లోకి రప్పించి అతనిచే ముక్కూ-చెవులూ పట్టించకపోతే నాపేరు గంగూలీనే కాను.

ధర్మ—అరె గోవింద్! నువ్వు కాస్త ఓర్పువహించవోయ్, [దగ్గుతూ] అదంతా నేను సరిచేస్తానుగా.

[ఆకస్మికంగా వేణీఘోషాల్ ప్రవేశం]

వేణీ—రమేశ్ యింతటివాడవా! నేనొక అవసరమై [illegible] దవచ్చాను. అమ్మ వచ్చిందా యిక్కడికి?

గోవింద—ఎందుకురారు బాబూ, వందసార్లు వస్తారు. ఇదీ మీ యిల్లేగా. అందుకనే ప్రొద్దుటనుంచీ రమేశ్ బాబుతో చెప్తున్నాను—రమేశ్, తారిణీబాబుతోనే ఆ తగాయిదాలు, జగడాలు పోయినై, అవన్నీ పోనీ. ఇంక వారు లేనేలేరు. మీ అన్నదమ్ములిద్దరూ కలిసిపోండి; మిమ్మల్నిచూచి మా కళ్ళు చల్లబడతాయి. అదీగాక పెద్దమ్మగారే స్వయంగా ఇక్కడికివచ్చినప్పుడు—

వేణీ—అమ్మ వచ్చిందా?

గోవింద—రావటమేనా? పని-పాటలు, ఏర్పాట్లు—అన్నీ ఆమే చూస్తున్నారు. మరి ఆమె కాకపోతే యింకెవరు చేస్తారు?

[అందరూ మౌనంగావుంటారు.]

గోవింద—[నిట్టూర్చి] ఈ ప్రాంతాల్లో ఆమెలాంటివా రెవరున్నారు? లేరు. వేణీబాబూ, నీముందు చెపితే పొగడ్త అనుకుంటారేమోగాని, ఎవ రేమన్నా, యీవూరు మొత్తంలో లక్ష్మీదేవి అంటే మీ అమ్మగారే. ఆలాంటితల్లి ఎవరికి లభిస్తుంది? [అని మళ్లీ నిట్టూర్చుతాడు.]

వేణీ—సరేగాని—

గోవింద—సరే అంటే కాదు వేణీబాబూ, నువ్వు రాకతప్పదు. ఈ భారమంతా నీపై నేవుంది. సరే, మీ రంతా యిక్కడేవున్నారు. ఇప్పుడు పిల్వవలసినవారి జాబితా తయారుచేస్తే మంచిదిగదూ. ఏమంటావ్ రమేశ్ బాబూ! ఏఁ పరాన్ మామా, బాగున్నదికదూ? ధర్మదాస్ అన్నా, ఇలాంటప్పుడు మెదలకుండావుంటే పని జరుగదు. ఎవర్ని ఆహ్వానించాలో యెవరిని వదిలెయ్యాలో అంతా నీకు తెలుసుగా.

రమే—అన్నయ్యా, ఒకసారి మీపాదధూళి ... ...

వేణీ—అమ్మ వచ్చినాక నేను వచ్చినారాకపోయినా—ఏఁ గోవిందబాబాయ్, ఏమంటావ్ ?

రమే—అన్నయ్యా, నేను మిమ్మల్ని విసిగించను కాని, మీకు యిబ్బందిలేకపోతే ఒకసారి వచ్చి ఏర్పాట్లూ అవీ చూడగోరుతాను.

వేణీ—అవును, ఇది బాగానేవుంది. అమ్మవచ్చిన తర్వాత నేను వచ్చినా రాకున్నా—అంతేకదూ పరాన్ తాతా? ఆ, రమేష్, అమ్మని త్వరగారమ్మని చెప్పు

చాలా అవసరమైన పనివుంది. ఇప్పుడు వుండటానికి తీరిక లేదు. ప్రజలందరూ ...

[అంటూనే గబగబా వెళ్ళిపోతాడు]

గోవిం—[బయటికేసి మెడచాచి బాగా పారజూచి] ఓయ్ వేణీ ఘోషాల్! నువ్వు ఆకుఆకుమీదా నడిస్తే, నేను ఆకు ఈనెలమీద నడుస్తాను, తెలుసా? నా పేరు గోవింద గంగూలీ! అమ్మగారు వచ్చినదీ లేనిదీ స్వయంగా చూద్దామని వచ్చావు లే; నాకే తెలియదనుకున్నావ్! [రమేశ్‌తో] చూచావ్ కదూ రమేశ్ బాబూ! ఎంత చక్కగా తియ్యని మాటలు అంటించానో విన్నావుగా. అచ్చంగా తేనెపూసిన కత్తి! ఇంక తనకు మర్యాద జరుగలేదని చెప్పుకోలేడు. లేకపోతే 'రమేశ్ పిల్లవాడనుకున్నా, వాళ్ళమామయ్య గోవిందగంగూలీ అక్కడే వుండె!' అని చెప్పుకునేవాడు. బాబూ, పెద్ద పెద్ద కార్యం - కరామతులకు యాజమాన్యం వహించడ మంటే మాటలా? ఒక్కొక్క యెత్తు పై యెత్తు లాలోచించుతూంటే బుర్ర తిరిగిపోతుందనుకో!

ధర్మ—గోవింద్, నువ్వు అధికప్రసంగం చేస్తున్నావ్; ఇక చాలించుతావా లేదా!

[ఒక వైపునుంచి సుకుమారి, ఆమె తల్లి శాంత వచ్చి, లోపలి వెళతారు. సరాన్ వారివంక మిరిమిరిచూస్తాడు. కొద్దిసేపట్లో నౌకరు షష్ఠిచరణుడు వస్తాడు]

సరాన్—ఆ లోపలికి వెళ్ళింది ఎవర్రా?

షష్ఠి—ఆవిడే—శాంతమ్మ, ఆమెకూతురూను!

పరాన్ — నేను అనుకున్నట్టే జరిగింది! ఇంతకూ వాళ్ళని యింట్లోకి రానిచ్చింది యెవరు?

షష్ఠి — ఆచార్యులుగారు పిల్చుకొచ్చారు. ఈ రెండురోజుల నుంచీ పనులన్నీ చేస్తున్నది వారేగా!

పరాన్ — [illegible] భోజనపదార్థాలు ముట్టుకుంటే యిక్కడ బ్రాహ్మలెవరూ పచ్చిమంచినీళ్ళయినా ముట్టరు.

[శాంత చాటునవుండి యీమాటలు ఆలకించుతున్నది కాబోలు, చప్పున బయటికి వస్తుంది.]

శాంత — అలా యెందువల్ల జరుగుతుందో నేనుకూడ వినవచ్చునా పరాన్ గారూ? [రమేశ్ తో] అవును బాబూ, మీరల్లా యీ గ్రామానికి జమీందారుడవే గదా. నువ్వే చెప్పు — దోషమంతా ఈ బ్రాహ్మణి శాంతమ్మ కూతురు దేనా? మీ కెవరికీ మగదక్షత లేనంతమాత్రాన ఇష్టమొచ్చినన్నిసార్లు దండించుతారా? ముఖర్జీ గారి యింట్లో రావిపూజ జరిగినప్పుడు [గోవిందుని వేపు వేలితో చూపి] ఈయనగారు పదిరూపాయల అపరాధం వసూలు చేసుకోలేదూ? ఊళ్ళో మానసాపూజ పేరుచెప్పి మావద్దనుంచి నాలుగు మేకల ఖరీదు గుంజుకున్నారే! మరి ఒకే తప్పుకు యిలా యెన్నిసార్లు వీరు న్యాయం విచారించుతారేమిటి?

గోవింద — శాంతమ్మత్తా, నువ్వు నా పేరెత్తావు కాబట్టి, నేను యథార్థమే చెప్పుతాను. ఈ గోవిందగంగూలి [illegible] సహించరాచి ఏమాటా చెప్పడని లోకమంతా

సుకుమా[illegible] రా పెద్దమ్మా, మీరు లోపలికి వచ్చి కూర్చోండి.

[భైరవాచార్యుడు, శాంత నిష్క్రమించుతారు]

గోవింద—చూస్తున్నావు కదూ పరాన్ మామా? మనల్ని [illegible] నుంచి వాళ్ళని లోపల కూర్చోబెట్టడానికి తీసుకెళ్ళాడు! భైరవుని సాహసం చూశావా! సరే...

పరాన్—ఈ కులభ్రష్టుల నిద్దరినీ మన అనుమతి లేకుండా యింట్లోకి యెందుకు రానిచ్చాడో యిప్పుడు రమేశ్ సంజాయిషీ చెప్పాలి. లేకపోతే మాలో ఎవ్వరమూ ఇక్కడ నీళ్లైనా ముట్టం.

పెద్దమ్మ—[ద్వారం వద్దకు వచ్చి] రమేశ్!

రమే—పెద్దమ్మా, నువ్వింకా యిక్కడే వున్నావా?

పెద్దమ్మ—ఆఁ, వున్నాన్లే. శాంతని సుకుమారిని నేనే సగౌరవంగా పిల్చుకొచ్చాననీ; ఆచార్యుడు కాదనీ గోవింద గంగూలీతో చెప్పు. వారిని బుద్ధిపూర్వకంగా అవమానించవలసిన అగత్యం లేదని కూడా చెప్పివెయ్యి.

పరా[illegible]—కాని వాళ్ళ నిక్కడినుంచి వెళ్ళగొట్టనంతవరకు మేము ఎవ్వరమూ ఇక్కడ మంచినీరు కూడా ముట్టము.

పెద్దమ్మ—అది యెల్లుండి సంగతి. ఇవాళ నా ఇంట్లో గడబిడ—గందరగోళం, తగాదాలు లేవదీయవలసిన అవసరం లేదని నేను చెప్తున్నాను తెలిసిందా? నేను అందరినీ ఆహ్వానించుతాను; ఎవరిని వదలటానికీ వీల్లేదు.

పరా—అయితే మాలో ఎవరూ ఇక్కడ నీళ్లైనా ముట్టమని నేనూ చెప్తున్నాను.

పెద్దమ్మ—రమేశ్, నన్ను బెదరించి భయపెట్టలేరని వారితో చెప్పు. ఇక్కడ అనాథులు, అనాథ స్త్రీలు, నిరుపేదల కేమీ కొదువలేదు. మా ఈ ఉద్యమంతా వృథా కాదు; పైగా సార్థకమే అవుతుంది.

రమేశ్—[వ్యాకులస్వరంతో] కాని వీ రత్యంతమూ గడబిడ చెయ్యాలని చూస్తున్నారు పెద్దమ్మా. దీనంతటికి జవాబుదారీ నీపైనే పడుతుంది సుమా.

పెద్దమ్మ—రమేశ్, ఇది నీ అజ్ఞానం నాయనా! మనయింట్లో కార్యం బాధ్యత మనపై కాకపోతే యితరులమీద పడుతుందా? ఇప్పుడు వీ రందరినీ వెళ్ళిపొమ్మని చెప్పి వెయ్యి. ఇంకా చాలా పనులు అలాగే వుండిపోయినై. కాలం వ్యర్థపుచ్చడానికి నాకు తీరికలేదు.

[పెద్దమ్మ లోపలికి వెళ్ళిపోతుంది. ముందుద్వారంనుండి [illegible], ధర్మదాసు, పరాన్‌లు మెల్లగా బయటికిపోతారు.]

రమే—నా కెవరూ లేరనుకున్నాను. కాని, పెద్దమ్మా, నువ్వెవరిదానవో వారికి అందరూ వుంటారు.

## మూడో దృశ్యం

బజారు

[శ్రాద్ధగృహంలో భోంచేసి దీనూభట్టాచార్య ఇంటికి [illegible] వెడుతున్నాడు. వెంట బాల-బాలికలుకూడ వున్నారు. అందరికీ [illegible] చేతిలో పొట్లాలు, రెండో చేతిలో చిన్నచిన్న మట్టిపిడతల్లో పాయసం [illegible].]

సుంద—[భయపడి] బాబా, భజ్జూ వస్తున్నాడు.

[అంతా ఉలిక్కిపడతారు. రమేశ్ నౌకరు భజ్జూ వస్తా

దీనూ—అరే, భజ్జూబాబే! ఎక్కడికి వెడుతున్నావ్ ?

భజ్జూ—ఏమండోయ్ భట్టాచార్యగారూ, ఏమిటి పట్టుకెళ్తున్నారు !

దీనూ—ఏం లేదు బాబూ, తినగా మిగిలిన యెంగిలిపదార్థం. పేటలో అలగాజాతి పిల్లలున్నారే, పాపం!—వెళ్ళగానే అంతా వచ్చి చేతులు చాచి అడుగుతారు. వాళ్ళకి పెడదామని ...

భజ్జూ—అరె! పేదలకుమాత్రం ఏం తక్కువ! బీదా - బిక్కీ అంతా అక్కడే బారులుతీరి కూచుని పూరీలు - పరమాన్నం తింటున్నారుగా ...

దీనూ—అవునవును, ఎందుకు తినటం లేదు? అంతా తింటూనే వున్నారు. మహాదాతగృహంలో ఏంలోటు? అయినా తిండికి రానేరుగదూ. అలాంటివాళ్ళకోసం కాస్త...

భజ్జూ—అయితే సరేలెండి—భట్టాచారిగారూ, ఇది మహా చిత్రమైన పూరండీ! ఏం తారుమారైంది! ఒకరు కూచుంటే ఒకరు లేస్తారు! ఒకడు పారిపోతే మరొకడు పట్టుకు వెళ్తాడు. హ హ హ !

దీనూ—అరే బాబూ, అంతా అలాగే జరుగుతుందయ్యా ! గొప్పగొప్ప కార్యం కరామత్తుల్లో అంతే—సుందా. కాస్త చిన్నోడిచేతిలోది అందుకో. [భజ్జూతో] అయ్యొబాబూ! ఇంకా మనవూరు కాస్త హద్దు-పద్దుల్లో వుందయ్యా—అరె, కాస్త దారిచూచి నడవండి. ఏమిరదెబ్బ తగిలితే చేతిలోముంతలు జారిపడతై— ఇదిగో బాబూ, మా అత్తవారివూళ్ళో చూచిన సంగ

దీనా—అవును బాబూ. ఎవరూ చిక్కించుకోలేరనే నేననే
దీను—ఒస్ సుందా. కాస్త త్వరగా నడవ్వే నువ్వు...
భజ్జూ—మా బాబుగారు ఎలాంటివారు! అచ్చంగా దేవతా పురుషులు!
దీనా—అవును, రమేశ్ బాబు దేవతాపురుషుడే — ఒరే పట్టీ! మళ్ళీ నోరు తెరుచుకు చూస్తూ నిలబడ్డావా!— సరేగాని, యిటు వెళ్తున్నావు ఎక్కడికి భజ్జువయ్యా?
భజ్జూ—ఆక్షాహ్యులుగారి యింటికి.
దీనా—సరే, వెళ్లు. త్వరగా వెళ్లు; మేమూ వెళ్తాము.

[అందరూ నిష్క్రమణ]

## నాలుగో దృశ్యం

[మధుపాలుని చిల్లరదుకాణం. బేర-సారాలు జరుగుతూంటాయి.]

ఒకమనిషి—ఒక కానీనూనె ఇవ్వటానికే సాయంత్రందాకా చేస్తావా యేం?
మధుపాలుడు—ఇస్తున్నానయ్యా, యిస్తున్నా.
రెండోవ్యక్తి—ఏమయ్యా, మధుపాలయ్యా, కానీ పసుపుకే యింత సేపా?
మధు—ఇస్తున్నాగదయ్యా. ఒక్కణ్ణేగదా...
మూడోవ్యక్తి—అర్ధణా పప్పుబద్దలకోసం ఎంత సేపు వుండాలయ్యా? ఇవాళ మాయింట్లో వంటచేసుకోనివ్వావల్లే వున్నదే!
మధు—అయ్యో బాబాయ్! వంట యెందుకు కాదు? ఇదిగో తీసుకో.

[రమేశ్ ప్రవేశం]

మధు—[మెడచాచి చూచి] అరె! ఏరు మన చినబాబుగారు! నమస్కారం బాబయ్యా! [అని క్రిటతీసుకొని లేచి ముందుకువచ్చి] తమరాకవల్ల మా వ్యాపారాల [illegible]ం పండింది బాబూ! కూర్చోండి.

రమేశ్—శ్రాద్ధంతాలూకు లెక్కలలో నీ కిచ్చేది పదిరూపాయలు యివ్వాలి. డబ్బుకోసం నువ్వొచ్చి రాకపోయిన. నేనూ పంపలేకపోయాను. ఇచ్చిపోదామని వచ్చాను. యిదుగో.

మధు—[చెయిచాచి రూపాయలు అందుకొని] బాబూ. దుకాణానికి వచ్చి బాకీ యివ్వటం మా తల్లిదండ్రులు... తాతలుకూడా యెరుగరే!

రమే—[పీటమీద కూర్చుని] ఏఁ మధూ! వ్యాపారం ఎలా వుంది?

మధు—ఏం వర్తకమో బాబూ! బేడ, పావలా, అర్ధరూపాయి, రూపాయి పావలా—ఇలాగే పెరిగి పెరిగి పోయిన డెభ్భైరూపాయలదాకా బాకీలు పడ్డై. అప్పు కెళ్తే టప్పుడు సాయంత్రం యిస్తాం, ప్రొద్దున్న యిస్తామంటారు. కాని మళ్లీ అక్కెల్లదాకా అమా... తల పెట్టరు—అరె, బెనర్జీగారా. దణ్ణాలండి. ఎప్పుడు దయచేశారు?

[బెనర్జీఎడంచేతిలో ఒక జారీచెంబు వుంటుంది. పాదాలకు [illegible] అయివుంటుంది. చెవుకు జంధ్యం చుట్టివుంటుంది. కుడిచేతిలో చేపలబుట్టలో చిన్న చిన్న చేపలు చుట్టబడివుంటాయి.]

బెనర్జీ—నిన్నరాత్రే వచ్చాను. మధూ, కాస్త పుగాకుపాయ యివ్వవోయ్. [అని చెంబు, చేపలు క్రిందపెట్టి] ఆ పల్లెది—సురభి వున్నదే—అది చటుక్కున నా చెయ్యి పట్టుకున్నదోయ్! చూచావా మధూ, ఎలాంటి కాలం వచ్చిందో! ఇవ్వి కానీ చేపలటయ్యా! బ్రాహ్మణ్ణి మోసగించి బాగుపడుతుందా ఆ భ్రష్టు రాల్లు! అది నాశనంగాను!

మధు—అరె, అది మీచెయ్యే పట్టుకొన్నదీ!

బెనర్జీ—దానికి ఒక్క అర్ధణా బాకీఅయ్యా, యింతమాత్రానికే బజార్లో పదిమందిలోనూ నాచెయ్యి పట్టుకోవాలా? అందరూ చూస్తూనేవున్నారుగా—నేను కాలకృత్యాలు తీర్చుకొని, చెంబుతోమి, నదిలో కాళ్లూ చేతులూ కడుక్కొని వస్తూ, అలా సంతబజారున వద్దామని బయల్దేరాను. ఆ ముండ ఒకగంపతో చేపలు ముందు పెట్టుకొని కూర్చుంది. నన్నుచూచి 'బాబూ, ఇవాళ అన్నీ అమ్ముడైపోయినయి' అని ముందుగానే అనేసింది. కాని నా కళ్లల్లోనా దుమ్ముకొట్టగలిగేది? గంపలో చెయిపెట్టేసరికే అది నా చెయ్యి లంకించుకున్నది—అరె, యిదివరకొక అర్ధణా యివ్వాలనుకో; యీ కాసిత్తో ముక్కాసీ అయింది; ఈ ముక్కాసీ బాకీ యెగ్గొట్టి వూరువదలిపెట్టి పోతానా? నువ్వే చెప్పు మధూ?

మధు—ఛీ! అలా యెందుకు జరుగుతుంది!

బెనర్జీ—అల్లా అనరే! ఊళ్లో ఒకరి పెత్తనమంటూ వుంటేగా! లేకపోతే చాకలి మంగళ్లను ఆ షష్ఠిగాడి యింటికిపోకుండా ఆపుచేయించి, వాడిగుడిసె పీకిపారేయించి బుద్ధి చెప్పరూ! [తటాలున రమేష్‌ను చూచి] అరె, మధూ. ఈ బా బెవరు?

మధు—వీరు మన చినబాబుగారు. [శ్రాద్ధం తాలూకు పదిరూపాయలు కురదలావుంటే, యిచ్చిపోదామని వచ్చారు.

బెనర్జీ—మంచిది, రమేష్‌బాబూ! చిరంజీవివి కా నాయనా. నువ్వు జరుగవలసిన విధంగానే జరిపావని విన్నాను. ఇలాంటి భోజనం ఈ ప్రాంతంలోనే ఎన్నడూ ఎవరూ పెట్టలేదని యిక్కడికి వచ్చాక తెలిసింది. కాని నేను కళ్ళారా చూడలేకపోయినందుకే విచారంగా వుంది. కొందరు దుర్మార్గుల మాటలతో మోసపోయి, వుద్యోగానికని కలకత్తా వెళ్ళాను. తీరా వెళ్లి ఏం అనుభవించాను! అయ్యోరామ! అక్కడ మనుషులు వుండగలా!

మధు—[పుగాకువేసి చిలుము అందించి] ఇంతకూ ఏదేనా వుద్యోగమయిందా?

బెనర్జీ—దొరక్కేం? నే నేమన్నా వచ్చీరాని చదువు చదివానా యేం? కాని ఉద్యోగం దొరికితే యేం ప్రయోజనం? ఏం చెప్పను అక్కడి గంద్రగోళం, గజిబిజీని! ఇంట్లోంచి బయటికిపోతే ఏ మోటారుక్రిందో పడకుండా బ్రతిక

చేరుకోగల్గితే పెద్దలు దిగొచ్చినట్టే! నువ్వెప్పుడైనా వెళ్లావా?

మధు—లేదండి; ఒకసారి మిడ్నపూరు మాత్రం చూచాను.

బెనర్జి—ఓయి పల్లెటూరుగబ్బిలాయి! ఎక్కడ కలత్తా, ఎక్కడ మిడ్నపూరు! నేను చెప్పేది నిజమో అబద్ధమో కొంచెం రమేశ్ బాబునే అడుగు. మధూ, తినటానికి లేకపోతే పిల్లవాడి చేయిపుచ్చుకొని బిచ్చ మడుక్కుం.

టూను—బ్రాహ్మణ్ణిగదా, భిక్షాటన తప్పులేదు—అంతేగాని, ఇంక పరాయిచోటుకు వెళ్లేమాటే తల పెట్టను. చెపితే నువ్వు నమ్మవుగాని, అక్కడ ఆకు కూర, అరటిపువ్వు, కరివేపాకులాంటివికూడ కొనుక్కొని తినాలి! - నువ్వుండగలవూ మరి? నే నీ నెల్లాళ్లు తిండీ-తిప్పల్లేక రోగిష్టిలా అయిపోయాను. [అని మధు చేతికి చిలుము యిచ్చేసి, దుకాణంలోని నూనె డబ్బాలోనుంచి కొంచెంనూనె చేత్తో తీసుకొని చెవుల్లోను, ముక్కులోను వేసుకుంటాడు. మిగిలినది మాడుమీద రుద్దుకుంటాడు.]

బెనర్జి—చాలా ప్రొద్దెక్కింది. ఇక ఒక బుటకవేసి యింటికి చేరుకుంటాను. ఏదీ మధూ, ఒకకానీ ఉప్పు యివ్వు, కానీ సాయంత్రం యిస్తాను.

మధు—మళ్ళీ అదేమాటా—సాయంత్రం! [లేచి వుప్పు కాగితంలో పొట్లాంకట్టి యిస్తాడు]

బెనర్జి—[ఉప్పు చేత్తోపుచ్చుకొని] ఏమయ్యా మధూ, మీ అంటకేమయిందయ్యా? ఇంత అన్యాయమా? సూబ

పగులగొట్టి డబ్బు గుంజుకోవాలని చూస్తున్నారా యేం?
[అని తనే మరికాస్త ఉప్పు పొట్లంలోవేసుకొని, రమేశ్ వంకచూచి నవ్వుతూ] నాకూ యిదే దారి; వస్తావా బాబూ, దారిలో కబుర్లు చెప్పుకుంటూ నడవొచ్చు.

రమేశ్—నా కింకా ఆలస్యం వుందిలెండి

బెనర్జి—అయితే సరే; [చెంబుతీసుకొని వెళ్లిపోతాడు]

మధు—ఏమండీ బెనర్జీగారూ, ఆ మైదాతాలూకు అయిదకాలు యింతేనా యేమిటి? ...

బెనర్జి—ఏమోయ్ మధు, నీకు సిగ్గూ-శరమూ కాస్తయినా లేనట్టుందే. ఆ దొంగాముండాకొడుకుల మాటలు విని కలకత్తా వెళ్లటంలో అయిదారు రూపాయలు యిట్టే ఖర్చయిపోయాయి. ఒత్తిడిచెయ్యటానికి యిదేనా అదను? ఒకరి సర్వనాశనం మరొకరికి పంట కళ్ళం! అంతేకదూ? చూచావా రమేశ్ బాబూ—వీళ్ళ వ్యవహారం?

మధు—[సిగ్గుపడి] చాలారోజులు అయిం...

బెనర్జి—అరె, అయితే యేమోయ్! అందరూ ఒక్కసారే యిలా నావెంటపడితే యింక యీవూళ్ళో వుండడమే కష్టమవుతుంది! [అని కోపగించుకొని, తన వస్తువులు తీసుకు వెళ్లిపోతాడు.]

[వనమాలి వచ్చి రమేశ్ ముందు నిలబడతాడు]

రమే—తమ పేరు?

వనమాలి—తమ సేవకుడు వనమాలి. ఈ గ్రామ ప్రాథమిక పాఠశాల ప్రధానోపాధ్యాయుణ్ని.

రమే——[కొంచెం ఆశ్చర్యాన్వితుడై లేచి నిలబడి] తమరేనా స్కూలు హెడ్‌మాష్టరు ?

వన——అవునండీ, తమ సేవకుడను నేనే. తమ దర్శనార్థం రెండుసార్లు వచ్చానుకాని, దర్శనం కాలేదు.

రమే——స్కూలులో ఎందరు పిల్లలు చదువుతున్నారు?

వన——నలభై ఇద్దరండీ. ఏటేటా యిద్దరు విద్యార్థులు మాధ్యమిక పరీక్షలో ప్యాసవుతున్నారు. ఒకపర్యాయం నారాయణబెనర్జిగారి మూడో పిల్లవాడికి స్కాలర్‌షిప్ కూడా లభించిందండి.

రమే——అలాగా !

వన——చిత్తం. కాని ప్రస్తుతం పాఠశాల పైకప్పు సరిచేయించకపోతే, వర్షపుసరంతా బడిలోనే పడుతుందండి.

రమే——అంతా కూలి మీ నెత్తిమీదే పడుతుందా యేం?

వన——మరేనండి. కాని, ఇప్పుడప్పుడే కాదులెండి; మూడు మాసాలనుండి మా కెవరికీ జీతమే ముట్టలేదు. ఇంక ఇంట్లో తినివచ్చి, ఈ అరవచాకిరి చెయ్యలేమంటున్నారు మాష్టర్లు

రమే——మీకు జీతం ఎంత?

వన——జీతం ఇరవైఆరు రూపాయలేగాని, ముడుతున్నది పదమూడు రూపాయల పదిహేను అణాలే.

రమే——అదేమిటి?

వన——ప్రభుత్వంవారి ఆజ్ఞ గదండీ. అందువల్ల 26 రూ.లకు రసీదు వ్రాసి ఇన్స్పెక్టరుగారికి చూపించాలి. లేకపోతే గవర్నమెంటు గ్రాంటు ఆపివేయబడుతుంది.

రమే—మరి విద్యార్థులముందు మీ గౌరవానికి భంగంకల్గటం లేదూ?

వన—లేదండి. ఇది దేశాచారమే గదండి. పైగా పిల్లలు మాకు పులినిచూచినట్లు భయపడతారు. బెత్తాలతో వాళ్ళవీపులు చిట్లగొడతాం కదండి!

రమే—అవును, అంతేలెండి. మరి మిగతా మాష్టర్లందరి జీతాలమొత్తం ఎంత?

వన—ఇరవైమూడు రూపాయలు.

రమే—ఇరవైమూడా? ఒకరికా, ముగ్గురకూనా?

వన—ముగ్గురకు కలిపేనండి. తొమ్మిది, ఎనిమిది, ఆరు రూపాయలు. కాని వేణీబాబుగారు ఇదికూడ అధికమే నంటున్నారు. ఎనిమిది, ఏడు, ఆరు రూపాయలైతే మంచిదని అంటున్నారు.

రమే—మంచిదే. వారే యజమానికాబోలు!

వన—చిత్తం. కార్యదర్శి వారేనండి. కాని తమ దొక్క రూపాయైనా ఎన్నడూ యివ్వరు. ఆ యదుముఖర్జి గారి కుమార్తె రమాదేవిగారు సాక్షాత్ లక్ష్మీస్వరూపిణి! వారి సహాయమే లేకపోతే పాఠశాలకు కప్పైనావేసే మూతపడేది.

రమే—మీ రిలా చెప్తున్నా రేమిటి? నే నిదేమీ విననేలేదే?

వన—అవును, చినబాబుగారూ! కేవలం వారి దయాదాక్షిణ్యాలవల్లే పాఠశాల సాగుతున్నదిగ్గాని, యింకెవరి సహాయంవల్లా కాదు. ఆమె తమ్ముడుకూడ అందులో చదువుకుంటున్నాడు. ఈ సంవత్సరం పైకప్పు వేయి

స్త్రామనికూడ చెప్పారు. కాని, యింకా యెందువల్ల కప్పించలేదో నేను చెప్పలేను. ఎవరైనా మనసు విరిచారేమో !

రమే—అలాకూడ జరుగుతుందీ? సరే, మీరు వెళ్ళండి. రేపు నేను మీ స్కూలు చూడటానికి వస్తానండి.

వన—చిత్తం. తమదయవుంటే మాకు లోటేముంది ?

[అని వనమాలి మళ్ళీ నమస్కరించి వెళ్ళిపోతాడు. రెండో వేపునుంచి గోపాల్, భజ్జాలు ప్రవేశించుతారు]

రమే—ఏం గుమాస్తాగారూ, ఏమిటిలా కంగారుగా వస్తున్నారు?

గోపాల్—వేణీబాబుగారి జులుం మరీ మితిమీరుతోంది చిన బాబూ! రోజూ సహించటం యెలా ?

రమే—ఏం జరిగిందేమిటి?

గోపా—పెదురుతోపుదగ్గిర ఇరవై రెండు యకరాలు ఇంకా పంపిణీ కాలేదు. అది యింతవరకు ముఖర్జీగారితో కలిసి దున్నుతున్నాం. అందులో ముఖర్జీగారికి, పెద బాబుగారికి మనకు—మురగ్గుకు సమానవాటాలు. ఆ మధ్య అందులోది పెద్దచింతచెట్టు కొట్టించి వారిద్దరే పంచుకున్నారు. మన కేమీ ఇవ్వనేలేదు. నేను తమతో చెపితే కాస్త కట్టిపేసుకోసం తగాదా యెందుకులే అన్నారు.

రమే—అవును గుమాస్తాగారూ, ఒక సామాన్యమైనదాని కోసం అన్నయ్యతో తగాయిదా పెట్టుకోవడమా?

గోపా—మరి ఆ భరోసాతోనే ఇవాళ వేణీబాబు ఉమ్మడి చెరువులోని చేపలుకూడ పట్టించుకెళ్ళారు. ఇప్పుడవి ముఖర్జీగారియింట్లో వాటాలు వేసుకుంటూ వుంటారనుకుంటాను.

రమే—కాని, అందులో మనకూ భాగం వున్నదని మీరు బాగా ఎరుగుదురా ?

గోపా—మరి, కాకపోతే ఉత్తినే నాకీ పనిలో తలనెరిసిందా చిన్నబాబూ ?

రమే—మరి అందరూ రమ మహా ధర్మనిష్ఠాపరురాలని చెప్తున్నారే. ఆవిడనే ఒకసారి ఎందుకు అడిగి చూడకూడదూ ?

గోపా—యావదాస్తీ తమకు అప్పగించి, నెలకింత అని ఏర్పాటుచేసుకొని ఎక్కడున్నించివచ్చారో అక్కడికే వెళ్ళమని చినబాబుతో చెప్పమని అమ్మెగారు మొక పక్కాంగా అన్నారని విన్నాను. జమీని కాపాడుకోవటం పిరికిపందలపని కాదనికూడ అన్నారట !

రమే—అయితే, దొంగతనమే సాహస మనుకున్నారు కాబోలు! భజ్జా, నీ చేతిలో లాఠీవున్నదా? ✓

భజ్జా—[క్రమోత్తి] అ, ఉన్నదండి. [వెళ్ళబోతాడు]

గోపా—[భయభీతుడై] కాని, చినబాబూ, వెళితే కొట్లాట జాకా వస్తుందండీ.

రమే—మరో వుపాయం ఏమున్నది?

గోపా—ఇలా ఏపనైనా ఒక్కసారిగా చేసెయ్యడం మంచిదా చినబాబూ!

రమే—మరి ఏంచెయ్యమని మీరు చెప్పేది?

గోష్ఠా—నేను చెప్పేది—ఆఁ, ముందు పోలీసులకు రిపోర్టు ఇవ్వాలి. కాకపోతే, మరోకసారి వారినే అడిగి...

రమే—అయితే అలాగే చెయ్యండి. నావంటి పిరికివాడు అంతకంటె మరోవిధంగా చెయ్యడంకూడా వుచితంకాదు. భజ్జా, నువు పోయి ఆయింటి యజమానురాలును మనకా చెరువులో వాటా వున్నదో లేదో అడిగిరా. ఉన్నదంటే చేపలు తీసుకురా, లేదంటే మెదలకుండా వచ్చెయ్యి—రెండు చేపలకోసం రమ అబద్ధమాడదనే నా నమ్మకం గుమాస్తాగారూ!

[భజ్జా వేగిరంగా వెళ్ళిపోతాడు]

## అయిదో దృశ్యం

[వేణీఘోషాలు గృహంలో విశ్వేశ్వరి గది. రమ వచ్చి ఎదురుగా దాసీని చూస్తుంది.]

రమ—ఏఁవమ్మా, పెద్దత్త ఎక్కడా?

దాసి—ఇంకా పూజాగృహంలోనుంచి రాలేదండీ. ఏఁ అమ్మా, పోయి పిల్చుకురానా?

రమ—ఆమె పూజకభ్యంతరమా? వద్దు వద్దు; నేను కూర్చుంటానులే. ఆమె బయటికివచ్చినాకనే నేను వచ్చానని చెప్పు.

దాసి—అలాగే అమ్మాయిగారూ.

[దాసి వెళ్ళిపోతుంది. కొంచెంసేపట్లో మెల్లగా అడుగులు వేసుకుంటూ యతీంద్రుడు వస్తాడు.]

యతీంద్రుడు—అక్కా!

రమ—[ఉలిక్కిపడి అటుతిరిగి] అరె, నువ్వెక్కణ్ణుంచి ఊడిపడ్డావ్‌రా?

యతీం—నేను నీ వెనక వెనకే వస్తున్నాగా, నువు చూళ్లేదూ?
[అని ముందుకొచ్చి రమని అలుముకుంటాడు]

రమ—ఏం చెడ్డపిల్లాడివిరా నువ్వు! వేళఅయిందే, బడికిపోవ్వూ?

యతీం—ఇవాళ మాకు సెలవు అక్కా!

రమ—సెలవు ఎందుకని? ఇవాళ బుధవారమేగా?

యతీం—బుధవారమైతే యేం? బుధ, గురు, శుక్ర, శని, ఆది వారాలు—ఒక్కసారిగా అయిదురోజులూ సెలవే.

రమ—ఎందుకని?

యతీం—మా స్కూలుకు పైకప్పు వేస్తున్నారుగా. తర్వాత సున్నం కొడతారు. చాలా పుస్తకాలుకూడ వస్తాయి. నాలుగైదు కుర్చీలు, బల్లలు కూడ వచ్చాయి. ఒక బీరువా, ఒక గడియారం వచ్చినై. ఒకసారి వచ్చి నువు కూడ చూచిరాఅక్కా!

రమ—ఏమిటిరా నువు చెప్పేదంతా?

యతీం—నేను చెప్పేదంతా నిజమే నక్కా! రమేశ్‌బాబు వచ్చారు కదూ. ఆయనే యిదంతా చేయిస్తున్నారు. ఇంకేమేమిటో చేయించుతానని చెప్పారుకూడాను. ఆయన రోజూవచ్చి ఒకగంట మాక్కు పాఠంకూడ చెప్తుతున్నాడు.

రమ—ఏంరా, ఆయనకు నువ్వెవరో తెలుసా?

యతీం—అ.

రమ—నువ్వాయన్ను ఏమని పిలుస్తున్నావు?

యతీం—మేమంతా చినబాబుగారనే అంటున్నాం.

రమ—[తమ్ముణ్ని దగ్గరకు లాక్కొని కౌగలించుకొని] చిన బాబుగా రేమిటిరా! ఆయన నీకు బావకదూ.

యతీం—ఛ !

రమ—'ఛ' ఏమిటి? నువ్వు వేణీబాబుని 'పెదబావ' అని పిలిచి నట్లే 'చినబావ' అని పిలవలేవూ?

యతీం—ఆయన నాకు చినబావా? నిజమేనా అక్కా?

రమ—అవును, నిజమే. ఆయన నీకు బావే.

యతీం—అయితే నేను ఇంటికివెళ్తాను అక్కా! వెళ్ళి నారూ, హారా, సంత—అందరికీ చెప్పిరానా?

[రమ మెడ ఆడించి వద్దంటుంది]

యతీం—ఏం అక్కా, ఇన్నాళ్ళనుంచీ ఆయన ఎక్కడున్నాడు?

రమ—చదువుకోవటానికి పరాయిచోటుకు వెళ్ళారు. జితిన్, పెద్దవాడవైనతర్వాత నువ్వూ అలాగే పరాయివూళ్లో వుండాలిసుమా! నన్ను విడిచిపెట్టి వుండగలవూ?

యతీం—[అనిశ్చితభావంతో ఒకటి రెండుసార్లు తలాడించి] ఏం అక్కా, చినబావ చదువు పూర్తయిందా?

రమ—ఆ, ఆయన చదువు సాంతమయింది.

యతీం—నీ కెల్లా తెలుసు?

రమ—[కొంచెంసేపు ఊరకుండి] తన చదువు పూర్తికానిదే యెవరైనా ఇతరపిల్లలకోసం ఇంతడబ్బు ఖర్చుపెడతారా? ఈమాత్రంకూడా నువ్వు తెలుసుకోలేవూ?

యతీం—[తెలుసునని తలూపుతాడు] సర్లేగాని అక్కా! చిన బావ మనఇంటికి రాడేఁ? పెదబావ రోజూవస్తుంటాడే.

రమ—నువ్వాయన్ను పిల్చుకురారాదూ?

యతీం—ఇప్పుడు వెళ్ళి పిలవనా అక్కా?

రమ—[వ్యాకులంగా, వాడిని చేరదీసి] నువ్వెంత పిచ్చిపిల్లా డివిరా! జతిన్, జాగ్రత, యెప్పుడేనా అలాంటిపని చేసేవు! తప్పు.

యతీం—నీ కళ్ళల్లో నీరుక్రమ్మిందేఁ అక్కా? నువ్వు వద్దన్న పని నే నెన్నడూ చెయ్యనుగా.

రమ—[కళ్ళు తుడుచుకొని] నువ్వు చెయ్యవని నాకు తెలుసుగా నువ్వు నా ముద్దులతమ్ముడివి కదూ, అందుకని!

యతీం—ఇంక ఇంటికి రావా అక్కా?

రమ—నువ్వు పద, నేను తర్వాత వస్తాను.

[యతీంద్రుడు వెళ్తాడు. విశ్వేశ్వరి ప్రవేశం]

విశ్వేశ్వరి—అమ్మాయ్, ఏం పనులమ్మా మీరుచేస్తున్నది? వేణీ దొంగపనుల్లో నువ్వెలా సాయం చేశావమ్మా?

రమ—ఆయ న్ని పనులు చెయ్యమని నే చెప్పలేదు పెద్దత్తా!

విశ్వే—రమా, నువ్వు స్పష్టంగా చెయ్యమనకపోయినా యిందులో నీ తప్పు తక్కువదేమీ కాదు సుమా!

రమ—నే నేంచేయను అత్తా? అప్పుడు మరో ఉపాయం లేక పోయింది. భజూ కర్రపుచ్చుకొచ్చి, అడిగేటప్పటికే చేపల పంపకం అయిపోయింది. బావ తనవంతు పట్టించుకొని వెళ్ళిపోయాడు. ఇరుగుపొరుగువారు కొందరు ఒకటీ రెండూ పట్టుకెళుతున్నారు.

విశ్వే—వాడు చేపల్లకోసమే రాలేదు రమా! రమేశ్ చేపలు, మాంసం ముట్టడు. అతను చేపలకోసం కాదు, భజ్జాని పంపింది—అసలు వెదురుతోపుదగ్గరి చెర్వులో తనకు భాగమున్నదీ లేనిదీ తెలుసుకోవటానికే వాడినిపంపింది. అందులో ఆ అబ్బాయికి వాటాలేదని నీ నోటితో ఎలా అన్నావో నువ్వే చెప్పు అమ్మాయీ?

[రమ తలవొంచుకొని మౌనంగావుంటుంది]

విశ్వే—అతనికి నీయం దెంత విశ్వాసము, గౌరవం ఉన్నాయో నువ్వెరుగవుగాని. నాకు తెలుసు రమా! ఆవాళ చింతచెట్లు కొట్టించి, మీరిద్దరే పంచుకున్నారు. గుమాస్తాపంతులు ఎన్ని చెప్పినా రమేశ్ ఏమన్నాడో తెలుసా? తనకు భాగమేవుంటే ఎలాగూ యిస్తారనీ, నువ్వు తన్నన్యాయం చేయవనీ అన్నాడు. కాని, నిన్న నువుచేసినపనితో... సరే, నే నొకమాట చెప్తున్నా విను: నువ్వు ఆస్తికి, ధనానికి యెంత విలువ యిచ్చినా, మనిషిప్రాణం అంతకంటె విలువైనది సుమా! ఇదిగో రమా! నువ్వు చెప్పుడుమాటలు విని, దేనికిగాని లోభించి నలువైపులనుండి దెబ్బకొట్టి అతన్ని నాశనం చెయ్యమాకు. ఆవిధంగా పోగొట్టుకున్నది మళ్ళీ ఎన్నడూ లభించదుసుమా.

రమేశ్... [నేపథ్యంలో] పెద్దమ్మా!

[రమేశ్ లోపలికిరాగానే రమ తలవొంచుకొని, ముడుచుకు కూర్చుంటుంది.]

విశ్వే—మిట్టమధ్యాన్నం వచ్చావేం నాయనా?

రమే— మిట్టమధ్యాన్నం కాకపోతే నీకు తీరిక ఎప్పుడుంటుంది? నీ కెన్నో పన్నులుంటాయి. నవ్వుతా వెందుకు? సరేగాని పెద్దమ్మా! చిన్నతనంలో ఒకనాడు ఇలాగే మధ్యాన్న మప్పుడు కళ్ళనీళ్ళు పెట్టుకుని నీవద్ద సెలవుతీసుకెళ్ళాను జ్ఞాపకం వుందా? ఇవాళా అలాగే సెలవుతీసుకోవటా నికే వచ్చాను. కాని ఇది ఆఖరుసారేమో ననిపిస్తోంది.

విశ్వే—రామరామ! అలా అంటావేఁ నాయనా? రా, ఇలా వచ్చి కూర్చో.

[రమేశ్ ఆమెవద్దకు వచ్చి కూర్చుని నవ్వుతాడు. కాని సమాధాన మేమీ చెప్పడు. విశ్వేశ్వరి అత్యంత వాత్సల్యపూర్వకంగా చేత్తో అతని తల, వీపు నిమురుతుంది]

విశ్వే—ఏఁ నాయనా, నీ కిక్కడ ఆరోగ్యం బాగుండలేదా?

రమే—పెద్దమ్మా, నాది పడమటిదేశపు పప్పు - రొట్టెలతో పెరిగిన శరీరం! ఇది అంత తేలికగా నిముతుందా? కాక పోయినా ఇంక నే నిక్కడ ఒక్కరోజుకూడ ఉండలేను. నా కిక్కడ ప్రాణం కడట్టుతూన్నట్టుంది.

విశ్వే—నీకు ఒంట్లో కులాసాగా వున్నట్టు విని నా గుండె కుదుటపడింది. కాని, అబ్బాయి! ఇది నీ స్వగ్రామం కదా, ఎందు కుండలేవు?

రమే—అది నేను చెప్పను. నీ వంతా యెరుగుదువని నాకు బాగానే తెలుసు.

విశ్వే—అంతా కాకపోయినా, కొంతవరకు తెలుసనుకో. కాని, ఈమాత్రానికే నిన్ను పోనిస్తానా రమేశ్?

రమే—కాని, ఇక్కడ ఎవరికీ నే నంటే ఇష్టంలేదు పెద్దమ్మా!

విశ్వే—ఎవరికో యిష్టంలేదని పారిపోవటమా? ఇప్పుడే నీశరీరం పప్పు-రొట్టెలతో తయారయిందని గొప్ప చెప్పుకు న్నావే, అది పారిపోయేందుకేనా? ఆఁ, సరేగాని, నువ్వేదో రోడ్డుమరమ్మతుకోసం చందా ప్రోగుచేస్తున్నా వని నీ గుమాస్తా చెప్పాడు—అదేమయింది?

రమే—ఆఁ, ఈ సంగతే చెపుతా విను. ఆ రోడ్డేదో ఎరుగుదువా? పోస్టాఫీసుముందునుంచి తిన్నగా స్టేషనుకు వెళ్ళే రోడ్డే. ఏ అయిదేళ్ల క్రితమో, పెద్దవానలకు చెడిపోయింది. మధ్యలో పెద్దగండి యేర్పడింది కూడాను. జనం కాలుజారిపడి కాళ్లూ చేతులూ విరగ్గొట్టుకుంటున్నారేగాని, మరమ్మతుమాట తలవరు. అదీ ఓ ఇరవై రూపాయల ఖర్చు. కాని, ఈ మాత్రానికే ఏడెనిమిది రోజులనుండి ఎడతెగకుండా తిరిగినా ఏ డెనిమిది కాన్లుకూడా చందా పడలేదు. నిన్నరాత్రి మధు దుకాణం ముందుగా వస్తున్నా. ఎవరో ఒక్కడ మిడీచందా ఇవ్వొద్దనీ, బూట్లు వేసుకొని, సైకిలుమీద తిరిగే వారికే దానిఅవసరమనీ ఎవ రేమివ్వకపోయినా, తమ అవసరంకొద్దీ వారే మరమ్మతు చేయించుకుంటారు, మీరుమాత్రం 'అయ్యా, బాబూ' అని వీపు నిమురుతూండండనీ జనానికి బోధించుతూండడం విన్పించింది.

విశ్వే—[నవ్వి] పోనీ, వారన్నట్టు నువ్వే బాగుచేయించరాదూ రమేశ్?—పూర్వులు యిచ్చిపోయిన డబ్బు వుందిగా.

రమే—[కొంచెం కోపగించుకొని] కాని, నే నెందుకు ఖర్చు పెట్టాలి? ఆలోచించకుండా, స్కూలుకోసం ఖర్చుపెట్టి నందుకే విచారంగా వుంది. ఈ గ్రామస్థులకోసం ఏమీ చెయ్యకూడదు. వీళ్ళకు దానమిచ్చినా మూర్ఖు డనుకుంటారు! మేలుచేస్తే స్వప్రయోజనం కొరకే చేసుకున్నాడంటారు. వీళ్లను క్షమించడం కూడా తప్పే. పిరికితనంవల్లనే అలా చేశా డను కుంటారు.

[విశ్వేశ్వరి నవ్వుతూంటుంది]

రమే—నవ్వుతా వెందుకు పెద్దమ్మా?

విశ్వే—నవ్వక యేంచెయ్యను నాయనా! అయితే నువ్వు వీరిపై కోపగించుకొని వెళ్లిపోవా లనుకుంటున్నావా రమేశ్? ఈ ప్రజలు యెంత దీనులో, దుర్బలులో, అజ్ఞానులో గ్రహిస్తే, వీరిపై కోపగించుకున్నందుకు నీకే సిగ్గువేస్తుంది. [రమతో] ఏం రమా, ఇందాకటి నుంచీ తలవంచుకొనే కూచున్నావేం? ఏం రమేశ్, బావకి మరదలికి మాటలుకూడా లేవా యేం?

రమ—[తల యెత్తకుండానే] నా కేమీ విరోధంలేదు పెద్దమ్మా! రమేశ్ బావ...

రమే—[ఉలిక్కిపడి]ఆఁ! రమే! ఒక్కతెవే వచ్చావా, పెత్తల్లిని కూడా వెంటపెట్టుకొచ్చావా?

విశ్వే—అలా అంటావేం రమేశ్! మీ కిద్దరికి బాగాపరిచయం లేదు. అందుకనే...

రమే—చాల్లే పెద్దమ్మా, క్షమించు. ఇంతకంటె పరిచయం అధికమవ్వాలని ఆశీర్వదించేవు! ఈమె యింటికివెళ్ళి తన పెత్తల్లిని పంపిందా, ఇంక అవిడ నిన్నూ నన్నూ నమలకుండా వదల్దు. అమ్మద్యో! నేను పారిపోతున్నాను. [అని లేస్తాడు]

విశ్వే—వెళ్ళమాకు రమేశ్. నా మాట విను.

రమే—[ఆగి] వద్దు పెద్దమ్మా, అంతా విన్నానులే. అహంకారంతో నన్నుకూడా తిరస్కరించి నడచుకొనేవారిని గూర్చి ఏమీ చెప్పొద్దు. నీ కేదైనా అవమానం జరిగితే నేను సహించలేను [గబగబా వెళ్ళిపోతాడు]

రమ—[విశ్వేశ్వరి వంక చూచి ఏడుస్తూ] నిన్నవమానించటానికి పెత్తల్లిని పంపుతానా? నాకీ కళంకం ఏమిటి పెద్దత్తా?

విశ్వే—[రమను దగ్గరకుతీసుకొని] నిన్నా అబ్బాయి తప్పుగా అర్థం చేసుకున్నాడమ్మా! ఎప్పటికైనా నిజం తెలుసుకోనక పోడులే.

——o——

# ద్వితీయాంకము

## మొదటి దృశ్యం

[తారకేశ్వరం బజారు. ప్రొద్దుపొడిచి ఎంతో సేపు కాలేదు. రమ చెరువులో స్నానంచేసి తడిబట్టలతో యింటికి వెళ్తూంటుంది. అకస్మాత్తుగా రమేశ్ తారసిల్లుతాడు. ఆమె చప్పున తలపైకి ముసుగు లాక్కోబోతుంది కాని, తడివస్త్రం పైకిరాదు. వెంటనే చంకలోని నిండుబిందె క్రిందపెట్టి, రెండు చేతులు తడివస్త్రంలోపల గుండెమీద పెట్టుకొని నిలబడుతుంది]

రమ—మీరు యిక్కడికెలా వచ్చారు?

రమేశ్—[ఒక ప్రక్కకు తొలగి] నన్ను మీ రెరుగుదురా?

రమ—ఎరుగుదును. మీరు తారకేశ్వరం ఎప్పుడు వచ్చారు?

రమే—ఇప్పుడే బండిదిగి వస్తున్నాను. మా బంధువులు వస్తా మన్నారు; కాని ఎవరూ రాలేదు.

రమ—బస యెక్కడ?

రమే—ఇం, కెక్కడా లేదు. నే నిదివర కెన్నడూ యిక్కడికి వచ్చినవాణ్ని కాదు. ఇవాళ్టి కెక్కడో చోటు వెతుక్కోవాలి.

రమ—భజ్జానికూడ వెంట తీసుకువచ్చారా?

రమే—లేదు, నేను ఒక్కడనే వచ్చాను.

రమ—మంచిదే. [అని చిరునవ్వునవ్వి కొంచెం మొహం యెత్తుతుంది. ఇద్దరి చూపులూ కలుస్తాయి. రమ మొహంవాల్చి, కొంచెం సంశయాత్మకంగా] అయితే మీరు నాతో రండి. [అని బిందె చంక నెత్తుకొని ముందుకు నడవబోతుంది.]

రమే—నేను మీతో రావటం తప్పయితే మీరు పిల్చేవారే కాదు కాబట్టి, అలాగే వస్తాను. మీరు నేనెఱుగని మనిషి అని అనిపించటంలేదు, ఫలానా అని జ్ఞాపకమూ రావటంలేదు. ఎప్పుడో స్వప్నంలో చూచానేమో ననిపిస్తోంది. మీ రెవరో చెపుతారా?

రమ—నా వెంట రండి. దారిలో చెప్తాను. మీ రా స్వప్నం చూచినట్లైనా ఎప్పుడో జ్ఞాపకంవుందా?

రమే—లేదు. మీతో యింకెవరూ లేరా?

రమ—లేరు ఒక దాసిమాత్రం బసలోవుంది. నౌకరు బజారుకు వెళ్ళాడు. అయినా నే నిక్కడికి తఱుచుగానే వస్తుంటానులెండి. ఇక్కడి సందు - గొందులు నాకు బాగా తెలిసినవే.

రమే—కాని, నన్ను మీ వెంట తీసుకెళ్తున్నా రెందుకు?

రమ—నేను తీసుకెళ్ళకపోతే మీ భోజనానికి చాలా ఇబ్బంది జరుగుతుంది.

రమే—అయితే కానివ్వండి, మీ కేం?

రమ—పురుషులకు మిగతా అన్ని విషయాలూ చెప్పగలంగాని, ఈ సంగతే చెప్పలేం. నేను రమని.

రమే—రమా ?

రమ—ఇప్పుడు ఎవరి పరిచయమే మీకు అసహ్యమో అది ఇదనే నేను.

రమే—కాని, న న్నెక్కడికి తీసుకెళ్తున్నావు?

రమ—నా బసకు. అక్కడ మా పెత్తల్లి లేదులే, మీరు భయపడకండి; రండి.

[ఇద్దరు నిష్క్రమించుతారు. వెంటనే ఒక మంగలి వస్తాడు. వాని వెనుకనే ఒక యాత్రికుడు గబగబ వస్తాడు. అతని జుట్టు, గడ్డం, మీసాలు గుబ్బుగా పెరిగివుంటాయి. గడ్డం కొద్దిగా నెరిగివుంటుంది. ఈ మనిషి [మొక్కు తీర్చుకోవటానికి అంటే స్వామికి తన జుట్టు యివ్వటానికి వచ్చేడు]

యాత్రికుడు —[కంగారుగా] మంగలీ, ఓ మంగలీ ! నువ్వు మంగలివేకదూ ? ఇలా వచ్చి కాస్త గడ్డం చెయ్యవయ్యా, చప్పున ఒకసారి మునిగివచ్చి స్వామిపూజ చెయ్యాలి. యిది పుణ్యక్షేత్రం కాకపోతే యిక్కడ దమ్మిడీ పనివుండదు. ఇదుగో, యీ పావలా తీసుకుని త్వరగా క్షవరం చెయ్యి. పన్నెండున్నరబండికి వెళ్ళిపోవాలి. ఇంటివద్ద మళ్ళీ పిల్లాడికి రెండురోజుల నుంచీ జ్వరంతగుల్తోంది. గొరుగు, త్వరగా గొరుగు. ఇక్కడ కూర్చోనా ?

మంగలి[చేత్తో పావలా అందుకొని, రొంటిని పెట్టుకుంటాడు. ఆ మనిషిని [కిందనుంచి పైదాకా రెండుసార్లు చూచి] అరె! నీ గడ్డం యెంగిలిపడిందే !

యాత్రి—యెంగిలేమిటి ? స్వామివారికోసం జుట్టు, గడ్డం పెంచాను, చూస్తున్నావుగా ! ఇవి నావా? యెంగిలి పడటమేమిటి ?

మంగలి—[చేత్తో చూపిస్తూ] ఇదిగో గడ్డం కొంత నెరిగివుంటేను. ఇది యెంగిలిపడిపోయింది.

యాత్రి—ఎంగిలి! ఒక మంగలివెధవ నాలుగణాలూ చేతిలో వేసుకొని కాస్తకత్తి త్రిప్పి, యజమానికి మరో పావలా ఇమ్మన్నాడు. నే నిప్పుడే రూపాయిపావలా అల

యంలో జమకట్టి అనుమతి తీసుకొస్తూంటే, యింకో యజమాని యెవరని అడిగాను. అయితే మరోచోటుకు పొమ్మన్నాడు. ఆ పావలా వదులుకొని, కోపంతో వచ్చేశాను. ఇదిగో త్వరగా కానివయ్యా, నీకు పుణ్యముంటుంది.

మంగలి—మరో ఎనిమిదణాలు తియ్యి. నాలుగణాలు వాడికి, నాలుగణాలు యజమానికీను.

యాత్రి—ఏమిటిది? మీరు మనుషుల్ని పిచ్చివాళ్ళని చేసేట్టున్నారే! ఐతే, నా పావలా ఇచ్చెయ్యి. మళ్ళీ పోయి వాడిచేతనే చేయించుకుంటాను.

మంగలి—పోతే పోరాదూ? నేను నిన్ను పట్టుకొని ఆపానా?

యాత్రి—[కోపంగా] నా పావలా నాకిచ్చెయ్యమంటున్నాను.

మంగలి—ఇంకా పావలా ఏమిటి? ఇంతసేపూ నీతో యీ తర్జన-భర్జన అంతా ఊరకేనే అనుకున్నావా?

యాత్రి—ఆఁ! ను వ్వంటావా నన్ను!

మంగలి—మహా పండితుడివి దిగొచ్చావులే! ఏమనుకున్నావో, ఇది తారకేశ్వరమయ్యా తారకేశ్వరం! మిరిమిరి చూచావంటె మెడపట్టి గెంటుతా, జాగ్రత్త! నీ కెవరు ఉపకారం చేస్తారో చూస్తాను!

[పిల్లవాని చేయిపట్టుకొని ఒక ప్రౌఢాంగన వస్తుంది. ఆమెను వెంబడించి యిద్దరుపూజార్లు వస్తారు]

మొదటిపూజారి—హైఁ, స్వామినే వంచించటమా! ఓసి దౌర్భాగ్యురాలా! మోసగించటానికి నీ కిం కెవరూ దొరకలా? ఒక్క రూపాయిపావలా మ్రొక్కుబడా?

ప్రౌఢ—[విచారంగా] లేదు బాబూ, నే నెవర్నీ మోసప్పుచ్చే దాన్ని కాదు. నేను రూపాయిపావలా 'ముడుపు' కట్టాను. ఆ రూపాయిపావలా ఇచ్చేశాను

మొ. పూజారి—సరే, ఎన్నాళ్ళయింది నువ్వు మొక్కుకుని?

ప్రౌఢ—మూడేళ్ళక్రితం, వరద వచ్చినప్పుడు. నేను చెప్పింది నిజమే బాబూ....

రెండో పూజారి—నిజం చెపుతున్నావా? ఒత్త అబద్ధాలకోరు! ఈ మూడేళ్ళలో మీయింట్లో యింకెవరూ కాయిలా పడలా? ఇంకెప్పుడూ మొక్కుకోవాల్సిన అవసరం కలుగలేదూ? అలా జరుగుతుందా? నీ గుండెమీద చెయ్యేసుకో—పిల్లలుగలదానివి. ఈ స్వామి మరె వరూ కాదు, తారకనాథస్వామి సుమా!

ప్రౌఢ—[భయభీతురాలై] బాబూ, శపించకండి. ఇదిగో, ఈ రూపాయికూడ తీసుకోండి.

మొ. పూ—[చెయ్యిచాచి, రూపాయి పుచ్చుకొని] ఇంతేనా, ఒక్కరూపాయా? నువ్వు కనీసం మరో అయిదురూపా యలు మొక్కావు. బాగా జ్ఞాపకం తెచ్చుకో. స్వామి దయవల్ల మేము అన్ని సంగతులూ తెలుసుకుంటాం. మమ్మల్నెవరూ మోసప్పుచ్చలేరు.

రెం. పూ—ఇచ్చెయ్యి అయిదురూపాయలూ! బిడ్డలుగలదా నవు—ఎందుకు స్వామికి కోపం తెప్పించడం? నీ పిల్ల లకు శుభం కలుగుతుంది—త్వరగా ఇచ్చెయ్యి.

ప్రౌఢ—[ఏడుపుమొహంతో] లేదు బాబూ, నాదగ్గర యిం కేమీ డబ్బులేదు. ఇంకెక్కణ్నుంచి తేను?



మొ. పూ—అదేఁ, మెళ్ళో బంగారపు తాయెత్తు వుందిగా. దానిని షరాబువద్ద తాకట్టుపెడితే అయిదురూపాయలు ఇవ్వడూ? పంపమంటే దుకాణంచూపటానికి మనిషిని పంపుతాం. తర్వాతఎప్పుడైనా వచ్చి విడిపించుకోవచ్చు.

[ఒక స్త్రీని చుట్టుకొని ఏ డెనిమిదిమంది బిచ్చగాళ్ళు వస్తారు.]

మొదటి బిచ్చగాడు—ధర్మం చెయ్యమ్మా, మీ కొడుకులు-కూతుళ్ళకు మేలు కలుగుతుంది.

రెం. బి—తల్లీ, నీ కూతుళ్ళు, అల్లుళ్ళు చల్లగా వుండాలి!

మూ. బి—దయతలచు తల్లీ, మీ అమ్మా నాన్నా...

నా. బి—అమ్మా, తల్లీ! మీ భార్యా - భర్తలు బిడ్డలతో చల్లగా...

[అందరూ లాగులాడుతూ, తోసుకుంటూను]

గడ్డం యాత్రికుడు—నేను జుట్టూ ఇవ్వను, గడ్డమూ ఇవ్వను. అసలు మొక్కే తీర్చను లే.

ప్రౌఢ—అయ్యో బాబు! ఇది నా ఇష్టదేవతాయంత్రమయ్యా, దీ న్నెలా తాకట్టుపెట్టేది?

బిచ్చగాండ్రచే చుట్టవేయబడిన స్త్రీ—అరె, కొంపమునిగింది! ఎవరో నా కొంగుముడి కత్తిరించుకుపోయాడు!

బిచ్చగాండ్రు—మీ కుటుంబం చల్లగావుండాలి తల్లీ! ఒక కానీ ఇవ్వమ్మా!

ము. పూజారి—అయ్యో తల్లీ! నువ్వు బిడ్డలతల్లివి; యిది దేవస్థానం!

మంగలి—గడ్డం చేయించుకుంటారా?

యాత్రి—గడ్డమా? వద్దులే. ఇది తారకనాథునిజుట్టులే. ఇక యింటికి పోతున్నాను.

స్త్రీ—అయ్యో! నే నిప్పుడు యింటికి ఎలా చేరుకోను ? నా మూటే కత్తిరించుకుపోయాడే !

బిచ్చగాండ్రు—ఒక్క కానీ దానంచెయ్యి తల్లీ, ఒక్క కానీ...
[అంటూ ఆమెను క్రోసు కెళ్తారు]

ప్రౌఢ—తారకనాథునితోడు ! నా యిష్టదేవతాయంత్రం లాక్కోవద్దు. [పిల్లవాని చెయిపుచ్చుకొని లాగుతూ త్వరత్వరగా వెళ్ళిపోతుంది]

మొ. పూ—ఒక్క రూపాయికుమించి గుంజలేక పోయాం.

రెం. పూ—అరె, ఆ దౌర్భాగ్యురాలిపద్ద ఇం కేమీా లేక పోయె. [ఇద్దరూ నిష్క్రమణ]

మంగలి—పోనీ పావలా అయినా దక్కింది. బ్రతుకులగోట్లం కున్నా ఎక్కడా ఒక్క పావలా దొరకదయ్యా !
[నిష్క్రమణ]

## రెండో దృశ్యం

[తారకేశ్వరంలో రమ బస. సామాన్యమైన పడకమీాద రమేశ్ కూర్చునివుంటాడు. రమ కంగారుగా వస్తుంది.]

రమ—మీారు బలేవారే! నేను మరోకూర తీసుకురాబోతే, మీా రింతలో లేచి చేయి కడుక్కొచ్చి పెద్దమనిషి లాగా పక్కమీాదికి వచ్చి కూచుంటారా ! లేచి వచ్చారేం, చెప్పండి?

రమేశ్—భయంవల్ల.

రమ—భయం! ఏంభయం? నా భయమా? [అని దగ్గరలో కూచుంటుంది.]

రమే—నీ భయం వుందనుకో. అదీగాక మరో భయం కూడా వుంది.

రమ—ఒళ్ళు వేడితగిలినట్లున్నదా? మీరు ముందే ఈసంగతి చెప్పలేదేం? అనుమానంగావుంటే, స్నానంచేసి, భోజనానికి కూచుంటారా?

రమే—ఏదో ప్రయాణంవల్ల అనుకున్నాను. ను వ్వింత శ్రమపడి ఎన్నెన్నో చేస్తే, నేను వేడితగిలిందని చెప్పి, నిన్ను నిరాశ చెందించనా? నీ చేతివంట ఇవాళ భోం చేయకపోతే మళ్లీ ఈ జన్మలో లభిస్తుందా?

రమ—చాలుచాలు. ఇంక ఆపండి. ఈ పరాయిచోట నిజంగానే జ్వరం వస్తే ఎంతప్రమాదమో మీరే చెప్పండి.

రమే—అది మంచిది కాదుగాని, ఈ రాణీ కష్టపడి చేసినవంట తినకపోవటం మాత్రం ఏమంత మంచిది చెప్పు?

రమ—ఈ మాత్రానికేనా! ఈ కాని చోట నే నేమీ ఎక్కువగా చెయ్యలేకపోయాను.

రమే—నీ వంటలసంగతి ఎవ రాలోచించారు? ఈ ఆదరసత్కారాలు, శ్రద్ధ — నా కింకెక్కడ లభిస్తాయి?

రమ—మీ యింట్లో మాత్రం ఆదరించేవారి కేం కొదువ?

రమే—ఇంతశ్రద్ధ ఇం కెవరికివుంటుంది చెప్పు! చిన్నప్పుడే అమ్మ చనిపోయిందాయె. తర్వాత పెద్దమ్మదగ్గరే నా ఎన్నాళ్ళో లేదు. ఆ తర్వాత మేనమామవద్దకు వెళ్లానే గాని, అక్కడా మేనత్త మృతిచెందినందున, యిల్లు

హోటల్లాగే వుండేది అలహాబాదులో చదువుతూండ
గాను హోటలే గతిఅయింది. గయ ఇంజినీరింగు కాలే
జీలో చదివేటప్పుడూ రోతకలిగించే హోటలు తప్ప
లేదు. ఇష్టమైతే తినటం, లేకుంటే మానటం. లేదనే
శత్రువులూ లేరు, బతిమాలే బంధు-మిత్రులూ లేరు.

[రమ మౌనంగావుంటుంది]

రమే—ఒంట్లో బాగాలేదని కడుపునిండా తినకపోయినా, నా జీవితంలో యిది సుప్రభాతంలా వుంది. నా జీవిత ప్రవాహమే ఒక్కసారిగా మారినట్టుంది.

రమ—[తల దించుకొని] మీరు ప్రతివిషయం యిలా పెంచి మాట్లాడుతున్నారేమిటి ?

రమే—పెంచగలశక్తే వుంటే తప్పకుండా పెంచేవాణ్ని. కాని నాకా శక్తి లేదు.

రమ—అది నా అదృష్టమే. ఇంకా అధికశక్తివుంటే నేనిక్కడనుంచి పారిపోవాల్సివచ్చేది. ఇంటికి వెళ్ళి తర్వాత మీరు నన్ను తిట్టుకోకుండా ఇదిమటే, నను పిలిచి, కడుపునిండా తిండైనా పెట్టలేదని నలుగురితోను చెప్పరుగా !

రమే—లేదు రాణీ! ఎవరిముందూ నిన్ను నిందించను. అంతే కాదు, నిన్ను పొగడను కూడాను. నాకీ రోజు నిందకు ప్రశంసకు అతీతమైనది. నా త్త్వానికి కడుపునింపటమేగాక మరోవిధమైన తృప్తికూడా వుంటుందని ఇంతకుముందు నే నెరుగను.

రమ—ఇవాళే మొట్టమొదటిసారిగా తెలిసిందా ?

రమే—అవును, ఇవాళే తెలిసింది.

రమ—తెలుసుకోవలసినది ఇంకా వుంది. కాని, ఆ వాళ నాకు కబురు పంపండి.

రమే—అంటే ?

రమ—అన్ని విషయాలకు వుద్దేశ్యం తెలుసుకోవాలనటాని కక్కడ వేరే వుద్దేశ్యం ఏముంటుంది? సరేగాని, నిజం చెప్పండి, నన్ను మీరు ఆనవాలు పట్టనేలేదా?

రమే—ఎలా గుర్తుపట్టగలనో నువ్వే చెప్పు ? చిన్నప్పుడు చూచాను. చాలాకాలానికి తిరిగివచ్చిన తర్వాత నీ ముఖం ఎప్పుడు చూచాను? నీ మొహం చూడా లనుకున్నప్పుడల్లా నువ్వు మొహం ప్రక్కకు పెట్టుకోవ డమో, తల క్రిందికివంచుకోవటమో జరిగింది. అందు వల్లే, ఎప్పుడో కలలో చూచానేమో ననిపించింది ఇవాళ చూడగానే. అటువంటి కల...

రమ—సరేగాని, మీరు రాత్రిపూట ఏం భోంచేస్తారు?

రమే—ఏది లభిస్తే అదే.

రమ—నా కొకసంగతి చెప్పండి : మీ రింత నిర్లక్ష్యంగా వుంటున్నా రెందుకని? మీ ఏ వస్తువు ఎప్పు డెక్కడ వుంటుందో, ఏమైపోతుందో తెలియదట ? దేని యందూ మోహ-మమతలే లేనట్టుంది. అంతా ఏదో శూన్యంలో మునిగి తేలుతున్నట్టుంది.

రమే—నన్నుగురించి ఇంతగా చెప్పిం దెవరు ?

రమ—ఇది తెలుసుకొని ఏంచేస్తారు? ఇంటికి వెళ్ళాక చెప్పిన మనిషితో జగడమాడటానికా?

రమే—అయితే మనుషులతో జగడమాడుతూ తిరగట్మమే నా పని అనుకుంటున్నావా ?

రమ—అదేగా చేస్తున్నపని. మీరు ఊళ్లోకి వచ్చినప్పట్నుంచీ నాతో తగాదాలేనాయె. మా పెద్దమ్మ మా ఇంటికి యజమానినా యేం? లేక నే నామెచే ఆమాటలు అని పించానసుకున్నారా—నా మొహమే చూడదలచుకోక పోవటానికి? నా సాక్ష్యంకోసం మనిషిని పంపారు— చెరువులోని చేపల్ని దొంగిలించింది నేనా?

రమే—సాక్ష్యం కోరలేదే—జవాబు కోరాను, అంతే. నీ జవాబుకు తిరస్కారమేమీ జరుగలేదుగా రాణీ!

రమ—లేదు. మీరు తిరస్కరించలేదు కాబట్టే, ఆ తప్పంతా నా నెత్తిమీదకివచ్చిపడింది. ఈ భారం నాకు అను భవంకావటం లేదూ? ఈ దండన నేను తెలుసుకోలేనా? గ్రామం మొత్తంలో మీకు వ్యతిరేకంగా ఎవ రేంచే సినా దాని బాధ్యత నాదేనా? మీ కోపమంతా నా పైనేనా? మీరు పట్నంలో ఈ న్యాయమే నేర్చుకు వచ్చారు కాబోలు!

దాసి—[ప్రవేశించి] అమ్మగారూ, సామానంతా మూటలు కట్టించారా? ఆలస్యమైతే ఆరుగంటల బండి అందదు.

రమ—కుముదా, దీని కింత తొందరెందుకు?

దాసి—మేఘాలు క్రమ్ముకొచ్చాయి. వాన వచ్చేటట్టుంది.

రమ—కురవనీ; మీరు ఎడారిలో కూర్చోలేదుగా.

దాసి—లేదులెండి; నౌకరుతో సామాను సర్దమని చెప్తాను.
[నిష్క్రమణ]

రమే—మీరు సాయంత్రంబండికి వెళ్ళాలనుకుంటున్నారు కాబోలు?

రమ—అవును; మీరు?

రమే—నేనా? నేను రేపల్లా యిక్కడ వుండకతప్పదు.

రమ—అసలే మీ ఒంట్లో బాగుండలేదు. అందులోను వర్షాకాలం. మీ రెక్కడవుంటారు?

రమే—ఎక్కడో వుంటాను. స్వామి పూజనిమిత్తం వచ్చే యీ యాత్రికులందరూ ఉండటంలా?

రమ—వారి విషయం వేరు. మీరు పూజకోసం రాలేదుగా. మీకు ఎవరిస్తారు చోటు?

రమే—[నవ్వి] ఎందుకోసం వచ్చిందీ మొహాన రాసి వుంటుందా?

రమ—[నవ్వి] అవును, రాసేవుంటుంది. తారకనాథుని దయ వల్ల భక్తులు దాన్ని చదువగలరు. ఆవిధంగా భక్తి లేనివారిని తెలుసుకొని వెళ్ళగొట్టేస్తారు. మీరు పక్క వగైరాకూడ తెచ్చుకోలేదే?

రమే—అన్నీ తామే తెస్తామన్నారు.

రమ—చాలా మంచి యేర్పాటే! ఒంట్లో బాగాలేదు. పైన మేఘావృతమైవుంది. వెంట ఒక్కనౌకరైనా లేడు. ఒక కప్పుకునేదీ లేదు, పక్కకూడా లేదు. భోజన సదుపాయం అసలేలేదు. అయినా దేన్నిగురించీ చింత వున్నట్టే లేదు. ఎప్పు డెక్కడ యేదిలభించితే అదే

ఆధారం. అచ్చంగా పరమహంసలాగే! ఏమిటీ ఇలా తయారయ్యారు?

రమే—ఎటూ యెవరూ లేనివారికి అలాగే జరిగిపోతూంటుంది.

రమ—అలాగే కన్పిస్తోంది. అయితే ఇవాళ్టికి ఈ యింట్లోనే వుండిపోండి.

రమే—కాని యింటివారు...

రమ—వారి కేమీ అభ్యంతరంవుండదు. వారికి ఇలాంటి స్వల్పవిషయాలు లెక్కలోనికావు. వారు వుండని స్తారు లెండి.

రమే—కాని, నీ బెడ్డింగు వుంచివెళ్ళాలి రమా!

రమ—అలాగే వుంచివెళ్తాను. కాని మళ్ళీ నాకుపంపాలి; ఎక్కడేనా పారవేయకూడదు సుమా.

రమే—బెడ్డింగు యెలా పారవేస్తాను! నువ్వు నన్ను మరీ పిచ్చివాణ్నిగా యెంచుతున్నావే. ఎవరో నాగురించి నీ కిలాంటి తప్పుడు అభిప్రాయం కల్గించివుంటారు.

రమ—[నవ్వి] ఇం కేం చెడుఅభిప్రాయం కల్గుతుందిలెండి. మా పెద్దమ్మే కల్గించివుంటుంది. అయినా ఆమె యిక్కడలేదుగా. మీరు నిర్భయంగా విశ్రాంతి తీసుకోండి. ఈలోగా నేను తతిమ్మాపనులు పూర్తి చేసుకుంటాను. [వెళ్లేందుకు లేచినుంచుంటుంది.]

రమే—ఇంటివారితో పరిచయం కాకపోతే...

రమ—మీకు చాలా చిన్నతనంనుంచీ పరిచయం వుంది. ఇప్పు డేమీ ఆలోచించనక్కరలేదు. బాల్యంలో 'రాణీ' అని పిల్చేవారే ఆమెదే యీ యిల్లు.

రమే—ఇది నీ యిల్లేనా? ఇక్కడ నీకు యిల్లెందుకు?

రమ—చెప్పానుగా ఈ స్థానం నాకు బాగుంటుందని. అందు వల్లే నేను ఇక్కడికి తఱచుగా వస్తుంటాను.

రమే—స్వామియందు నీకు పరమభక్తి కాబోలు!

రమ—దీనిని భక్తి అనరు. కాని జీవించివున్నంతకాలం ఏదో చెయ్యాలిగా.

దాసి—[ప్రవేశించి] అక్కా, వానజల్లు ఆరంభించింది. ఇవాళ వెళ్ళడం కష్టమే.

రమ—ఇవాళ ప్రయాణంసాగదా? అయితే రేపే వెళదాం.

దాసి—అట్లయితే బ్రతికిపోయాం. కాని ఇవాళే వస్తామని కబురుచేశామే? ఇంటివద్ద ఆదుర్దాపడతారేమొ?

రమ—కుముదా! మధ్యమధ్య ఆదుర్దాపడటం మంచిదేలే. నే వస్తున్నా, పద.

[దాసి నిష్క్రమణ]

రమే—నా మూలంగానే ఇవాళ నీ ప్రయాణం ఆగిపోయింది.

రమ—మీగురించి కాదు, మీ అనారోగ్యంవల్ల. మొహం చూస్తే జ్వరం వచ్చేటట్లేవుంది. ఈస్థితిలో మిమ్మల్ని వదిలిపెట్టి నేను యెలా వెళ్ళగలను?

రమే—నేను నీ క్షేమింకానుగా, రమా! పైగా దారిలో ముల్లు లాంటివాణ్ణికూడాను. అయినా స్వగ్రామస్థుడుగా నాకివాళ నువుచూపిన గౌరవ-మర్యాదలు నోటితో చెప్పటం బాగుండదు.

[రమ మళ్ళీ వెళ్ళబోతుంది]

రమే—నువ్వు సుఖంగావుండాలని, చిరంజీవివి కావాలని ఆశీర్వదించుతున్నాను రమా!

రమ—[చటుక్కున వెనక్కితిరిగి] నిజంగా ఇప్పుడు మీ మీద కోపంవస్తోంది బావా! నేను హిందూవిధవను. నన్ను చిరకాలం జీవించమనటం శపించటమే అవుతుంది. శుభాకాంక్షులైన వారెవరూ విధవల నిలా ఆశీర్వదించరు. ఇక నే వెడుతున్నాను.

[త్వరగా వెళ్లిపోతుంది]

## మూడో దృశ్యం

[గ్రామమార్గం. పగలు మూడోజాము. ఎడతెరిపిలేకుండా నాలుగు రోజులు వర్షం కురియుటవల్ల కాలువలు, చెరువులు, గుంటలు నిండుగావున్నై. దారి బురదమయంగా వుంది. ఇంతకుముందే వాన వెలిసింది. చేతికి గొడుగు పుచ్చుకొని వేణీ, గోవిందుల ప్రవేశం. వారి బట్టలమీద బురద నీరు చిందినమరకలు కనపడుతూంటాయి.]

గోవింద—[చాటునుంచి] ఇంకా సందేహం యెందుకంట? కట్టతెగ్గొట్టి నీరు వదిలెయ్యమని చెప్పేందుకు మహా చుట్టం దిగొచ్చాడు! లేకపోతే పొలాలు మురుగుల్లో మునిగిపోతాయట, మునిగిపోతే మునగనీ. ఈ అలగాజాతి ధైర్యంచూచి ఏడవాలో నవ్వాలోకూడ తెలియకుండా వుంది పెదబాబూ.

వేణీ—చూచారా! ఈ రైతువెధవల పొలాలు ఓవంద యెకరాలు మునిగిపోతుందని చెరువుకట్ట తెగ్గొట్టాలట! ఈ చెరువుకోసం ఏటా రెండువందలరూపాయల నీటి

తీరువా యివ్వాల్సివస్తోంది. ఇప్పుడు నీరు బయటికి వదిల్తే, ఇంక అందులో ఒక్క చేపయినా వుంటుందా?

గోవింద—ఇంకా చేపలుండటమే!—మీ నీచజాతి ముండా కొడుకులు ఎప్పుడేనా ఒక్కసారిగా రెండురూపాయలు చూచారూ? ఒక్కనాడే రెండువందల రూపాయల నష్టమంటే మీ కేం తెలుస్తుంది! మనుష్యుల్ని కాపలా పెట్టావు కదూ? దొంగవెధవలు చాటుమాటుగా గండి పెడతారేమో! ప్రాణంమీదికి వచ్చినప్పుడు ఈ వెధవలు ఏమైనా చేయగలరు పెదబాబూ!

వేణో—జవానును, గోపాలుణ్ని పంపాను. రమ మొఖాసా పేర్పురం అక్కరుకొడుకు లిద్దరికీ కూడ కబురుపంపాను. వాళ్ళిద్దరే వందమందికి జవాబివ్వగలరు.

గోవింద—మంచిపనిచేశావు బాబూ! నేను పుగాకువేసి చిలుము పీలుస్తూండగానే మీ నౌకరు వచ్చేశాడు. 'ఏమిటిరా హరీ, వానలో తడుస్తూవచ్చా' వని అడిగాను. 'పెదబాబుగారు పిల్చుకురమ్మన్నా' రని చెప్పాడు. బడయి చెప్పుకోవటం కాదుగాని బాబూ, యింకి ఒక్కదమ్ముపీలిస్తే ఒట్టు! చప్పున గొడుగు, కర్ర చేతబట్టి, బయల్దేరాను. మీ అత్త 'ఈగాలి, వానలో ఎక్కడికండీ' అంటూ వెనకనుంచి కేకలు సాగించింది. 'హావే పిచ్చిదాన! పెదబాబు కబురంపితే, వానేమిటి వంగిడేమి'టిని చక్కా వచ్చేశాను. నీ కబురు వస్తే యింకా వెనక-ముందాడటమూ!

సనాతనుడు—గంగూలీ బాబుగారూ, కొందరు వెళ్లారులెండి. మే మీ బాబుగారినే నమ్ముకున్నాము; మీపాదాలే పట్టుకుంటాము. [వేణీబాబు పాదాలపై బడి ఏడుస్తాడు]

రెం. కృషి—[వేణీపాదాలు పట్టుకొని] మమ్మల్ని బ్రతికిస్తారో చంపుతారో మీ దయ! మీపాదాలు వదిలిపెట్టము.

వేణీ—[విదలించి పాదాలుతప్పించుకొని] పో పొండి; నీటి తీరువా రెండువందలు మే మెందుకు నష్టపడుతాం? —పదండి, మనం వెళదాం ఇంకా పనులున్నై.

[వేణీ, గోవిందులు వెళ్ళటానికి ఉద్యుక్తులవుతారు]

కృషికులు—పెదబాబూ, గంగూలీగారూ, అయితే నిజంగానే మమ్మల్ని చంపివేస్తారా?

గోవిం—[ఆగి వెనుదిరిగి, మొహ మింతచేసి] మీరు చస్తారో బ్రతుకుతారో మాకేం తెలుసు.

[ఇద్దరూ నిష్క్రమించుతారు]

కృషికులు—అయ్యో దేవుడా! నిజంగానే మమ్మ చంపివేస్తావా! పైనవుండి అంతా చూస్తున్నావుగదా, దీని కేమీ దారిచూపవా ?

[అందరూ నిష్క్రమణ]

## నాలుగో దృశ్యం.

[రమ యింటిముందరిభాగం. సంధ్యాసమయం. ప్రాంగణంలో ఒక ప్రక్కన చండీమండపం కొద్దిగా కనపడుతూంటుంది. రెండోవేపున తులసికోట. రమ చేతో దీపంపట్టుకొని మెల్లగావస్తుంది. దీపం తులసికోటవద్ద పెట్టి, వంగి నమస్కరిస్తుంది. అంతలో రమేశ్ మెల్లగాప్రవేశించి ఆమె తల వేపున నిలబడతాడు.]

రమ—[తలెత్తి, అకస్మాత్తుగా రమేశ్‌నుగాంచి, ఆశ్చర్యంగా] ఆఁ, మీరా! ఎక్కణ్ణుంచి?

రమే—రమా, నే నొక అవసరమైన పనిమీద వచ్చాను.

రమ—[చిరునవ్వు నవ్వి] ఇలాగేనా వచ్చినుంచు నేది? ఎవ రైనా చూస్తే దీపం పెట్టి యింతసేపూ నేను మీకే నమ స్కరించుతున్నా ననుకుంటారు !

రమే—నేను నీ వద్దకే వచ్చాను రమా.

రమ—[నవ్వి] అది నాకూ తెలుసు. కాకపోతే, మా పెద్దమ్మ కోసం వచ్చారని అన్నానా నేను? [అని దీపం చేత్తో తీసుకొని లేచి నిలబడుతుంది]

రమ—చెప్పండి, ఏమిటి పని?

రమే—నువ్వంతా వినేవుంటావు. నీళ్లు బయటికి వదలటాన్ని గురించి నీ అభిప్రాయం తెలుసుకోవటానికే వచ్చాను.

రమ—నా ఉద్దేశ్యమా ?

రమే—అవును. నీ అభిప్రాయంకోసమే ఇక్కడికి వచ్చాను. రమా, ఆపత్సమయంలో దీనులకోరికను నువ్వు కాదన వని నే నెరుగుదును.

రమ—నీళ్లు వదలటం అవసరమేగాని, యి దెలా కుదురుతుంది రమేశ్ బావా? పెదబావ యిష్టపడలేదుగా.

[వేణీ, గోవిందుల ప్రవేశం]

వేణీ—లేదు. నేను ఒప్పుకోను. ఎందుకు వదలాలి? రెండు మూడు వందలరూపాయల చేపలు పోతాయని ఎరుగు దురా? ఆ డబ్బు రైతులు యిస్తారా?

రమే—రైతులు పేదవాళ్లు. వా రింతడబ్బు యెక్కడ తెస్తారు? అన్నయ్యా, మీ రీ విషయం కాస్త ఆలోచించి చూడండి.

వేణి—ఆలోచించాన్లే, కాని రమేశ్! మనం యింతడబ్బు ఎందుకు నష్టపడాలో తెలియటంలేదు. [గోవిందునితో] చూచారా, మాతమ్ముడుగారు జమీని ఇలాగే నిర్వహిస్తాడు! తమ్ముడూ, ఆ వెధవలు ప్రొద్దుటనుంచీ మాయింటివద్దే ఏడుస్తూ పడివున్నారు. నాకు అంతా తెలుసు. మీ యింటివద్ద జవానులేడూ? వాళ్ళ పాదాలకు చెప్పల్లేవా అని అడుగుతున్నాను. వెళ్లు, పోయి ఆ ఏర్పాటేదో చెయ్యి! నీరు దానంతట అదే తగ్గిపోతుంది. [అని గోవిందునితో కలసి 'హి హ్హి హ్హీ' అని నవ్వుతాడు]

రమే—కాని, మనం ముగ్గురం రెండువందలనష్టాన్ని తప్పించుకోవటానికే చూచుకుంటే, పాపం! ఆ దౌర్భాగ్యుల యెడాదిగ్రాసం నాశనమైపోతుంది అన్నయ్యా! వాళ్ళ అయిదారువేల రూపాయల పంట మన్నైపోతుంది.

వేణి—అయితే కానీ; వాళ్లకు అయిదువేల రూపాయలు నష్టమైతే మనకేం, యాభై వేలుపోతే మనకేం? ఆ వెధవల కోసం రెండు వందలరూపాయలు నష్టపడతామా తమ్ముడూ?

రమే—అయితే వాళ్ళు సంవత్సరమంతా ఏం తింటారు?

వేణి—[నవ్వి, తలపంకించి, ఉమ్మేసి] ఏం తింటారా? నువ్వు చూస్తూవుండు—ఆ వెధవలు భూములు తాకట్టుపెట్టి

డబ్బు తీసుకోవటానికి మనవద్దకే వస్తారు. తమ్ముడా! నువ్వు కొంచెం తాపీగా ఆలోచించి పని చెయ్యి. మన పెద్దలు మనకు యిచ్చిపోయినట్లే మనమూ క్రిందా మీదాపడి మన సంతానానికి కూడా వుంచిపోవాలి. వాళ్లేం తింటారని అడిగావు కదూ? అప్పుచేసితింటారు, లేకపోతే వాళ్ళని నీచజాతి అని ఎందుకన్నారు?

గోవింద... అది ఋషులు, మునులు చెప్పిన శాస్త్రోక్తి. మీరూ నేనూ కల్పించినదా ఏమిటి?

రమే—మీరు వాళ్లెమైతే యేం అనుకున్నప్పుడు ఇంక చర్చించి ప్రయోజనమేముంది అన్నయ్యా?

వేణీ—లేదు, లాభం లేదు. [రమతో] రమూ, నీ పేర ప్రకారం అక్కరు లేదూ, అతని కొడుకులకు కబురంపాను. [గోవిందునితో] పదండి, మనం అలాపోయి చూద్దాం. ప్రొద్దుకూకుతోంది కూడాను.

గోవింద—అలాగే, రా బాబూ, పోదాం.

[ఇద్దరూ వెళ్తారు]

రమే—రమూ, నువ్వు 'సరే' నను. ఆయన ఒక్కడూ కాదన్నంతమాత్రాన యింతఅన్యాయం జరగటమా? నే నిప్పుడే వెళ్ళి కట్ట తెగ్గొడతాను.

రమ—మరి, చేపలుపోకుండా ఏమిఏర్పాటు చేస్తారు?

రమే—ఇప్పుడు అంత నీరువుండగా చేపలు పోకుండా చేయటానికేమీ ఉపాయం లేదు. మన మీ నష్టం భరించక తప్పదు. లేకపోతే గ్రామంలో జనం చచ్చిపోతారు.

[రమ మాట్లాడదు]

రమే——మరి నువ్వు ఒప్పుకున్నట్లేనా ?

రమ——ఊఁ హూఁ, నే నింత నష్టం భరించలేను. అదీగాక ఈ ఆస్తి నాది కాదు, తమ్ముడిది. నేను వాడికి సంరక్షకు రాలిని మాత్రమే.

రమే——కాదు, ఇందులో సగం ఆస్తి నీదని నాకు తెలుసు.

రమ——అది పేరుకుమాత్రమే. యావదాస్తి జితిన్ కే దక్కు తుందని నాన్నగారికి తెలుసు. అందువల్లే నాపేర సగం వ్రాసిపోయారు.

రమే——[వినయపూర్వకంగా] రమా! ఇది యేమంత నష్టం? నువ్వు కలదానవు. నీకీ నష్టం ఒక లెఖ్ఖలోదికాదు. ఈమాత్రానికి నువ్వు జనాన్ని ఆకలితో చావనీవద్దని బ్రతిమాలుతున్నాను. నేను నిజం చెప్తున్నాను—ను. విందత కాఠిన్యం చూపుతావని నేను కలలోకూడ తలచలేదు.

రమ——నేను నష్టం భరించలేకపోవటమే కాఠిన్యత చూపటమ యితే సరే, కఠినురాలనే అనుకోండి. మరి మీరింత దయగలవారైనప్పుడు మీరే ఆ నష్టం అంతా భరించ కూడదూ?

రమే——రమా, డబ్బువ్యవహారం వచ్చినప్పుడే మనిషి నిజ రూపం బయటపడుతుంది. మోసం-కపటం అప్పుడు చెల్లవు. అలాగే ఇవాళ నీ యదార్థస్వరూపం కన్పడు తోంది. కాని నువ్విలాంటిదానవని నే నెన్నడూ అను కోలేదు. ను వ్వింతకంటె గొప్పదానవని, వీ రందరి కంటె ఉన్నతస్థానంలోవున్నావని తలచాను. నిన్నింక

కఠినురాలివనటంకూడా తప్పే. నీ వతి నీచురాలివి, హీనురాలివీని.

రమ—ఏమన్నారు, నే నెలాంటిదాన్ని?

రమే—ను వ్వతి నీచురాలివి. నే నిప్పు డెంత వ్యాకులంగా వున్నదీ తెలిసే, ఆ దీనుల నోటివద్ద కూటివిలువ నా వద్ద గుంజుకోవాలనుకున్నావు ఈ మాట అన్నయ్య కూడ నోటితో అనలేకపోయాడు. కాని. స్త్రీవయి వుండిన్నీ నువు తేలిగ్గానే చెప్పగలిగావు. సరే, రమా, నీ కివాళ ఒకమాట చెప్పిపోతున్నాను—నేనూ యీ నష్టాన్ని రాబట్టుకోగలను సుమా. కాని, మనిషి జాలిబుద్ధిమీద దెబ్బకొట్టడంవున్న దే అది ప్రపంచంలో సమస్త పాపాలకు మించిన పాపం. ను వ్వివాళ ఆ పాపానికే ఒడిగట్టి నావద్ద డబ్బులాగడానికి వలపన్నావు.

[రమ విహ్వాల అయి, హతబుద్ధిలా చూస్తుంటుంది]

రమే—నా బలహీనత యేదో మీరు బాగా యెరుగుదురు. కాని దాన్ని నొక్కినందువల్ల ఇవాళ ఒక బిందువురస మైనా రాదు. మరి నే నేంచేస్తానోకూడ నీకు చెప్పే వెళ్తాను. నే నిప్పుడేపోయి కట్ట తెగ్గొట్టేస్తాను. మీరు న న్నడ్డగించగల్గితే ఆ ప్రయత్నం చేసుకోండి.

[రమేశ్ వెళ్తుంటే రమ పిలుస్తుంది]

రమ—కొంచెం వినిపోండి. నా యింట్లో నన్ను మీ యిష్టం వచ్చినట్లు అవమానించినదానికి నే నేమీ అనదలచు కోలేదు. కాని మీరు ఆ పనిమాత్రం చేయకండి?

రమే—ఎందువల్ల?

రమ——మీ రింత అవమానించినా నేను మీతో తగాయిదా పడదలచుకోనక పోవటంవల్లనే.

రమే——అయితే ?

రమ——బహుశా అక్కడికి అక్బరు సర్దారుముఠా చేరివుంటుంది.

రమే——నీ అక్బరుముఠాలో ఎవరెవ రెందరువున్నారో నే నెరుగను, తెలుసుకోవాలనీ లేదు. తగాయిదా-కొట్లాట లంటే నాకు ఇష్టంలేదు కాని, ఇప్పుడు నీ సద్భావానికి నా ముందేమీ విలువలేదు. [అని విసురుగా వెళ్ళి పోతాడు]

పెత్తల్లి——[ప్రవేశించి] ఎవరే అమ్మాయ్ బిగ్గరగా మాట్లాడు తున్నాడు! గొంతు విన్నదిలాగే వుందే ?

రమ——ఎవరూ లేదులే.

పెత్తల్లి——అయితే యెవరూ లేకుండానే నాకు వినపడిందం టావా! దీపం వెలిగించి పూజకు కూర్చున్నానో లేదో, ఎవరో ఘర్షణపడుతున్నట్టు విని, లేచివచ్చాను.

రమ——ఆయన వెళ్ళిపోయాడులే. నువ్వుపోయి పూజ చేసుకో. [లోపలివేపు చూస్తూ] కుముదా !

కుముద——[ప్రవేశించి] ఏమిటి అక్కా ?

రమ——కాస్త పెద్దత్తగారి యింటిదాకా నా వెంటరా.

పెత్తల్లి——ఈ వేళప్పుడు అక్కడి కెందుకే!

రమ——చూడు పెద్దమ్మా, ప్రతిదీ నీ కెందుకమ్మా. పద, —కుముదా !

కుముద—రా, వెళదాం. [ఇద్దరూ వెళ్తారు]

పెత్తల్లి—అయ్యో తల్లీ! కొట్టొచ్చావే! తారకేశ్వరంసంగతి పదిమందీ వినకపోతారా! నలుగురితోను పోట్లాడలేక నే చస్తున్నాను! [నిష్క్రమణ]

[వేణీ, గోవిందులు, దెబ్బలుతిన్న అక్బరు, అతని కొడుకులిద్దరు—గౌహార్, ఉస్మాన్‌లు ప్రవేశం]

అక్బరు—[స్థంభాన్ని ఆనుకొని కూర్చునివుంటాడు. మొహం మీద రక్తంమరకలుంటాయి] అరె అల్లా!

గౌహార్—[తలమీది నెత్తురు తుడుచుకొని] ఏం అబ్బా, బాగా బాధగావుందా?

అక్బర్—యా అల్లా!

వేణీ—నామాటవిని స్టేషనుకు పద అక్బర్! వాడికి ఏడేళ్ళ జైలుశిక్ష పడకపోతే నన్నడుగు.

రమ—[ప్రవేశించి] అరె, ఎవరు మి మ్మీవిధంగా కొట్టింది? [అని దగ్గరగా కూచుంటుంది.]

అక్బరు—[ఆకాశంవేపు చెయ్యెత్తి] అల్లాయే.

వేణీ—అల్లా అల్లా! 'అల్లా అల్లా' అంటూ ఇక్కడకూర్చుంటే ఏమవుతుంది? స్టేషనుకు రమ్మంటున్నాను. ఇందుకు బదులుగా నేను వాడికి పదేళ్ళ శిక్ష వేయించకపోతే—రమా! నువ్వు మాట్లాడవేం? నా వెంట పోలీసుస్టేషనుకు రమ్మని చెప్పు యితనితో.

రమ—అక్బర్! ని న్నిలా గాయపర్చింది ఎవరు?

అక్బరు—చినబాబు అమ్మాయిగారూ!

రమ—అలాజరుగుతుందా? మీా బాబూకొడుకులు ముగ్గుర్నీ చినబాబు ఒక్కరే కొట్టారా? ఇది మూడువందలమంది కూడ చేయలేని పనే!

అక్బరు—అదే జరిగింది అమ్మాయిగారూ!—శెభాష్ చిన బాబూ! నువ్వు నిజంగా తల్లిపాలు తాగావు! కర్ర త్రిప్పటమంటే అదీ!

గోవింద—అరె, ఈమాటే స్టేషనుకువచ్చి చెప్పమంటున్నాను. నీ కా చినబాబుకర్ర తగిలిందో, ఆ వెధవ భజ్జాగాడి దెబ్బ తగిలిందో—అదే చెప్పూ.

అక్బరు—ఆ పొట్టిగుంటడా నన్ను కొట్టేది? కర్రత్రిప్పటం వాడి కేం తెలుసయ్యా? ఏం గౌహర్, నీ తొలి దెబ్బకే కూలిపోయాడుగదూ వాడు?

[గౌహర్ నోటితో ఏమీా చెప్పక 'అవు'నని తలూపుతాడు]

అక్బరు—నా దెబ్బే తగిల్తే వాడు చావనే చచ్చేవాడు. గౌహర్ దెబ్బతోనే వాడు 'అమ్మో' అంటూ పడిపో యాడు అమ్మాయిగారూ!

[గౌహర్ మళ్ళీ తలూపుతాడు]

అక్బరు—ఆ తర్వాత—అమ్మాయిగారూ—చినబాబు వాడిచే తిలోకర్ర తీసుకొని గండివద్దకుపోయి నిలబడ్డాడు. యింక మే మాయన్ను కదిలించలేకపోయామమ్మా. చీకట్లో ఆయనకళ్ళు పులికళ్ళలా మెరిసినై. ఆయన 'అక్బర్, నువ్వు ముసలివాడివి, దూరంగా తప్పుకో. కట్ట తెగ్గొట్టకపోతే ఊళ్లో జనమంతా ఆకలితో మాడి

పోతారు. నువ్వు వ్యవసాయం చేస్తున్నావుగదా;
నీకూ పొలమూ-పుట్రా వుందిగా. నీ పంటే నష్టమైతే
నీ కెలా వుంటుందో ఆలోచించు' అన్నాడు. నేను
సలాం పెట్టి 'మమ్మల్ని రాణీ అమ్మగారు పంపారు చిన
బాబూ, మేము ప్రాణంపోయినా కట్ట కాపాడుతామని
చెప్పివచ్చాము. మీరు అడ్డంరాకండి బాబూ! మీ
చాటున పలుగు-పారలతో గండికొడుతున్న వాళ్ళపని
పట్టి మేమూ వెళ్ళిపోతా' మన్నాను.

వేణీ—స్వామిద్రోహి వెధవ, వాడికి సలాంకొట్టివచ్చి, ఇక్కడ
గప్పాలు కొడుతున్నాడు.

[అక్బరు, అతని కొడుకులు ప్రతివాదానికి చేతులెత్తుతారు]

అక్బరు—ఏమండోయ్ పెదబాబూ! మర్యాదగా మాట్లా
డండి. స్వామిద్రోహం అనకండి. ముసల్మాన్ బిడ్డలం
ఏదైనా సహిస్తాంగాని, నమ్మకద్రోహమంటే సహించం,
తెలిసిందా! [చేత్తో మొహంమీది నెత్తురు తుడుచు
కొని] చూచారా అమ్మాయిగారూ, ఈయనగారు
మమ్మల్ని స్వామిద్రోహుల మంటున్నారు! బాబూ,
మీ కళ్లతో చూస్తే తెలిసేది చినబాబు అంటే
ఏమిటో!

వేణీ—[మొహం చిట్లించి] చినబాబు ఎలాంటివాడో అదే
స్టేషనుకువచ్చి చెప్పరాదూ? కట్టమీద కాపలాకా
స్తుంటే చినబాబువచ్చి కొట్టాడని చెప్పండి.

అక్బరు—[నాలుక కొరుక్కొని] తోబా! తోబా! పగల్నే
రాత్రి అనమంటారా బాబూ?

—

వేణీ—కాకపోతే మరోవిధంగా చెప్తా. ఈ రాత్రే స్టేషనుకు పోయి రిపోర్టిచ్చి, నీ గాయాలు చూపించిరా. రేపు వారంటుపుట్టించి, వాడిని జైల్లో పెట్టిస్తాను—రమా, ఇతనికి నువ్వైనా నచ్చజెప్పు. మళ్ళీ యిలాంటి అవకాశం దొరకదు.

[రమ మాట్లాడకుండా అక్బరువంక చూస్తుంది.]

అక్బరు—[తల అడ్డంగా త్రిప్పుతూ] లేదమ్మా, ఈ పని నా వల్ల కాదు.

వేణీ—[గద్దించి] ఏం, ఎందువల్ల కాదు?

అక్బరు—[కృద్ధస్వరంతో] ఏంమాట చెప్తున్నారు పెద బాబూ? నాకు సిగ్గూ-శరమూ లేవూ? నాలుగుఊళ్ళల్లోను సర్దారు అనిపించుకుంటున్నానే!—రాణీ అమ్మగారూ? మీరు సెలవిస్తే పోయి జైల్లో కూచుంటాను గాని, ఏ మొహం పెట్టుకొనిపోయి ఫిర్యాదు చేయను?

రమ—నువ్వు నిజంగానే స్టేషనుకు వెళ్ళవా అక్బర్ ?

అక్బరు—లేదు అమ్మాయిగారూ, నే నేంచేయమన్నా చేస్తాను గాని, స్టేషనుకుపోయి నా దెబ్బలు చూపించలేను— లే గౌహర్, మనం ఫిర్యాదూ చేయొద్దు, యేమీవద్దు; యింటికి పోదాం పదండి.

[ముగ్గురూ లేచి వెళ్ళడానికి ఉద్యుక్తులవుతారు]

గోవింద—పెదబాబూ, వీళ్ళు నిజంగానే వెళ్ళిపోతున్నారే. అంతా వ్యర్థమేనా ?

వేణీ—రమా, వీళ్ళని ఆపవూ ! యీ అవకాశం జారిపోతే మళ్ళీ లభిస్తుందా?

[రమ మాట్లాడకుండా తల ఒంచుకుంటుంది. అక్బరు, అతని కొడుకులు మెల్లగా బయటికి వెళ్ళిపోతారు]

వేణీ—ఓహో, నాకు అంతా తెలిసింది!

గోవిం—అయితే మనం విన్నది అబద్ధం కాదన్నమాటే!

[ఇద్దరూ నిష్క్రమించుతారు]

రమ—రమేశ్ బావా నువ్వింతపని చేస్తావని, చేయగల శక్తి నీకు ఉందని నేను కలనైనా ఊహించ లేదు!

## అయిదో దృశ్యం.

[గ్రామంలో ఒక ప్రక్క. కొన్ని కూలిపోయిన మందిర శిథిలాలు కన్పిస్తూంటాయి. చెట్లు, లతా-గుల్మములతో నిండివుంటుంది. ఇటు వేపు జన సంచారమే లేనట్టుంది.]

[వేణీ, గోవిందులు ప్రవేశం]

గోవింద—[అతి జాగ్రతగా అటూయిటూ చూచి] ఏ వెధవ అయినా ఇక్కడకూడ దాగి వింటాడేమో! బాబూ, నేను వలపన్ని త్రాడు చేత్తో పట్టుకూర్చున్నాను. కాస్త లాగితే, దభేల్ మని పడిపోవటమే!

వేణీ—పని అయినట్లేనా?

గోవిం—లేకపోతే నిన్నూరకే ఈ అడవిలోకి పిల్చుకొస్తానా బాబూ?—ఒరే భైరవాచారిగా! గుడ్డిగవ్వ విలువ చెయ్యని వెధవ్వి మాకెదురు వస్తావా? నీ బ్రతుక్కు యింకొకరికి రక్షకుడివా? ఇంక ముందు నీ తాతముత్తాతల భూమి నిల్పుకో! నీ కూతురు పెళ్ళి యెలా చేస్తావో నేనూ చూస్తాను!

వేణీ—శిక్షే అయిందా?

గోవిం—[చేతివ్రేళ్ళు పదీ పైకెత్తి] వెయ్యికీ. కాని—బాబూ—ఇంక ఒట్టిమాటలతో పనిజరగదు. చెరిసగం సుమా!

వేణీ—[హుషారుగా] చెరిసగ మేమిటి? పదిఅణాలు, ఆరణాలు!

గోవిం—శెభాష్! చిరంజీవివి అవుబాబూ! ఇంతేకాదు, దుర్గా పూజ సమీపిస్తోంది. ఈసారి ఆ యమముఖరీ కూతురు రమ దుర్గ నెలా నిలబెడుతుందో చూడాలి! వచ్చే ఫాల్గుణంలో తమ్ముడికి వడుగు యెలాచేస్తుందో కూడా నలుగురికీ చూపిస్తాను; లేకపోతే నా పేరు గోవిందగంగూలీయే కాదు.

వేణీ—అయితే ఆ తారకేశ్వరం సంగతి నిజమేనా?

గోవిం—నిజంకాకపోవట మేమిటి? అప్పుడు వెంటవెళ్లిన నౌకరువెధవ వూరకే చెప్పాడా? డబ్బాశపెట్టి, ఎంత బుజ్జగించినా లొంగనిదే! అప్పుడు నాపాదధూళి వాడి నెత్తిన వేసి 'ఒరే, నువ్వెంత రమనౌకరు వయినా శూద్రుడివి. పిల్లలుగలవాడివి; బ్రాహ్మడి పాదధూళి నీ తలపైవుంది. ఇంక నువ్వు అబద్ధంచెప్పావా తెల్లవారకముందే నిన్ను పాము కాటువేసితీరుతుందిరా' అని భయపెట్టాను.

వేణీ—ఆఁ, తర్వాత?

గోవిం—వెధవ బిక్కమొగంవేశాడు. నేను 'ఒరే, నీనౌకరీపోతే మళ్లీదొరుకుతుందికాని, ప్రాణంపోతే మళ్లీవస్తుందటరా' అన్నాను. అప్పుడు వాడు జరిగినదంతా చెప్పివేశాడు

సాయంత్రం ఆరుగంటల బండికి ఆవిడ రాలేకపోయిం దిట. చినబాబు రాత్రిఅంతా అక్కడే వున్నాడ్టట. భోజనం అయినతర్వాత, నవ్వులు, సరసాలూనట— అయినా మన కెందుకు ఇతరులను నిందించటం. జరిగి నది మాత్రం నిజం !

వేణీ—చూచారా, ఆవాళ అక్బరును స్టేషనుకు రానివ్వలేదు!

గోవింద—యెలా వెళ్లనిస్తుంది ? అయ్యోబాబూ, అలా పోనిస్తుందా ?

వేణీ—హుం! చీకటిపడుతోంది, పోదాం పదండి.

గోవిం—పద [చప్పున వేణీ చేయిపట్టుకొని] చూడుబాబూ, నేను ముందే చెప్పతున్నాను—ఆ స్త్రీలో సగభాగం మేనల్లుడు ఎక్కడ పట్టుకుపోతాడో— జాగ్రత్త సుమా!

వేణీ—మీ రా విషయంలో నిశ్చింతగావుండండి. నేను వుండగా అలాజరగటమే!

గోవిం—ఈసారి రమకు సంతసొమ్ములో వాటా వదలటానికి వీల్లేదుబాబూ; కాని ఈ సంగతులన్నీ యిప్పుడప్పుడే పొక్కనివ్వకూడదు.

వేణీ—[నవ్వి] అలాగే చూద్దాంలెండి.

[ఇద్దరూ నిష్క్రమణ]

## ఆరో దృశ్యం.

[రమేశ్ యింట్లో. చాలా ప్రొద్దుపోయినాకూడ రమేశ్ తన పడక గదిలో కూర్చుని ఏదో వ్రాస్తూ-చదువుకుంటున్నాడు. ఆకస్మికంగా

నేపథ్యంలో ఎవరిదో ఏడుపు వినబడుతుంది. కొంచెంసేపట్లో గుమాస్తా గోపాలునిమెడకు వ్రేలాడుతూ భైరవాచార్యులు బిగ్గరగా కేకలుపెడుతూ ప్రవేశించుతాడు. రమేశ్ గాబరాగాలేచి నుంచుంటాడు.]

భైరవాచార్య—[ఏడుస్తూ] చినబాబూ, నా కొంపమునిగింది బాబూ!

రమే—ఏంజరిగింది గుమాస్తాగారూ?

గోపా—బాబూ, పని పూర్తిచేసుకొని పడుకోవటానికి వెడుతున్నాను. ఇంతలో ఎక్కడినుంచో ఆచార్యులుగారు పరుగెత్తుకొని వచ్చి నామెడను వాటేసుకున్నారు. నామెడ వదలటంలేదు సరిగదా, యీ యేడుపూ ఆపటంలేదు.

రమే—ఆచార్యులుగారూ, ఏం జరిగిందండీ?

భైర—బాబూ, నాకు సర్వనాశనమైంది. ఇంక నేను పిల్లా-జెల్లలతో చెట్టుక్రిందే వుండాల్సివస్తుంది.

రమే—చెట్టుక్రింద ఎందుకని? ఇల్లేమయింది?

భైర—ఇంకా ఇల్లెక్కడిది బాబూ? అది జప్తు అయిపోయింది.

రమే—ప్రొద్దుటవరకు ఏమీలేదే! ఇంతలో ఎవరు జప్తు చేయించారు?

భైర—గోవిందగంగూలీ పినమామ సంత్ ముఖర్జీ జప్తు చేయించాడు. [బిగ్గరగా ఏడుస్తాడు]

గోపా—అరె, నామెడ వదలవయ్యా. బాబుగారితో అంతా వివరించిచెప్పండి. నన్నిలా గట్టిగా చుట్టుకోవటమెందుకు? వదలండి.

భైర—[గోపాలుని మెడవదలి] వెయ్యి ఎనభై ఏడురూపాయల అయిదణాలన్నర—డబ్బుకు డబ్బుపోయింది, నేనూ నాశనమయ్యాను బాబూ!

గోపా—డబ్బు అప్పుతీసుకున్నారా?

భైర—లేదు గుమాస్తాగారూ. ఒక్క దమ్మిడీ తీసుకోలేదు. అంతా శుద్ధఅబద్ధం. నోటుకూడా ఫోర్జరీయే. ప్లయింటు చేసినదీ, సమను వచ్చిందీ, డిక్రీఅయిందీ తెలియదునాకు. ఇల్లు జప్తుకూడా అయినట్లు నిన్న ఒక రిద్దరు చెప్పగా విని, కోర్టుకుపోయి విచారించితే తెలిసింది. వెయ్యి ఎనభై యేడు రూపాయల—

రమే—ఇంత విడ్డూరం ఎన్నడూ వినలేదు గుమాస్తాగారూ!

గోపా—పల్లెటూళ్లలో ఇలాంటివి చాలా జరుగుతూంటాయి బాబూ. పేదవాళ్ళమీద కోపం వచ్చినప్పుడు గొప్ప వారు ఇలాగే వారిని సాధించుతూంటారు. ఇదంతా వేణీబాబూ, గంగూలీగార్ల పనే. ఆచార్యులుగారు మొదట్నుంచీ మనతరఫునవుంటున్నారు. అందువల్లే ఇంతఘోరం జరిగింది.

భైర—అవును చినబాబూ, అంతే. అందువల్లే నాకీ విపత్తు వచ్చిపడింది.

రమే—మరి, గుమాస్తాగారూ, దీనికి ఉపాయ మేమిటి?

గోపా—ఇది చాలా ఖర్చుతోకూడిన పని. ఈ అప్పపత్రమూ కల్పితమే, ఈ సాక్ష్యాలూ అబద్ధమే. ఈయనపేరుతో సంతకంచేసి యింకెవరో సమను తీసుకుని, ఆ మనిషే

కోర్టుకువెళ్ళి, అప్పు తీసుకున్నట్టు అంగీకరించివుంటాడు. కోర్టుకువెళ్ళి పూర్తిగా తెలుసుకోనిదే ఏమీ చెప్పలేము.

రమే—అయితే మీరు వెళ్ళి, అన్నివివరాలు తెలుసుకోండి. ఎంత ఖర్చయినాసరే, దీనికి ప్రతీకారంచెయ్యాల్సిందే. మళ్ళీ ఇంకెవరికీ యిలాంటి అన్యాయం జరక్కుండా ప్రయత్నించాలి.

భైర—[చప్పున రమేశ్ పాదాలపై పడి] బాబూ చిరకాలం వర్ధిల్లు నాయనా! ఆయురారోగ్య, సంతానవృద్ధి పొంది మహారాజులా జీవించు. దేవుడు మీకు...

రమేశ్—[పాదాలు వదిలించుకొని] ఆచార్యులుగారూ, ఇంక మీరు యింటికి వెళ్ళండి. చేయగలిగిన దంతా నేను తప్పకుండా చేస్తాను.

భైర—భగవంతుడు మీకు—

రమే—ఆచార్యులుగారూ, చాలా ప్రొద్దుపోయింది యింక వెళ్ళండి.

భైర—దేవుడు మిమ్మ చిరంజీవిని చేయుగాక! మిమ్మల్ని—

[నిష్క్రమణ]

రమే—[నిట్టూర్చి] గుమాస్తాగారూ, ఇదేగా మన అభిమాన ధనం! ఇదే మనదేశ పవిత్ర, శాంత, న్యాయనిష్ఠగల గ్రామీణసమాజం!

గోపా—అవును, ఇదేనండి. ఈ పని వేణీబాబుదని అందరికీ తెలిసిపోతుంది. అందరూ చాటుమాటుగా చెప్పు కుంటారుగాని బయటపడి ఈ అన్యాయాన్ని ఎదిరించరు. వెనుక గంగూలీ తన విధవ వదినను కొట్టి యింట్లోంచి

పెళ్ళగొడితే, వేణీబాబు ఆయనకు అండగావున్నందున ఎవరూ నోరెత్తలేదు. ఆమె యేడ్చి అందరితోను మొరపెట్టుకున్నది. అందరూ 'మే మేం చెయ్యగిలం? భగవంతుని ప్రార్థించుకో. ఆయనే న్యాయం చెయ్యాలి' అన్నారు.

రమే—తర్వాత ?

గోపా—ఆ గంగూలీయే ఇప్పుడు జనాన్ని కులబహిష్కారం చేస్తూ తిరుగుతున్నాడు. జీవచ్ఛవంలావున్న యీ సమాజానికి ఇలాంటివిషయాల్లో పల్లెత్తిపలికే సాహసం లేదు. నా చిన్నతనంలో యిలా కాదు. విధవ వదిన గారిపై చేయిచేసుకొని ఎవరూ విముక్తిపొందేవారు కాదు. అప్పట్లో సమాజం శిక్షించేది, అపరాధి ఆ శిక్షను శిరోధార్యం చేయవలసివచ్చేది.

రమే—అయితే ఇప్పుడా గ్రామీణసమాజమే లేకపోయిందా?

గోపా—యిప్పు డున్నదానిని మీరు వచ్చినప్పట్నుంచీ చూస్తూనేవున్నారుగా. పీడితులను రక్షించకుండా, దీనులను దుఃఖపథంలోనికే నెట్టుతున్నదానినే మనం 'సమాజ'మంటూ మహాపాపం చేస్తున్నాము. నేటి సమాజం మనల్ని రసాతలంవేపుకే ఈడ్చుకుపోతోంది.

రమే—[చకితుడై] గుమాస్తాగారూ, ఇదంతా మీ కెలా తెలిసింది?

గోపా—స్వర్గస్థులైన మీ తండ్రిగారు చెప్పారు. ఇప్పుడు మీరు భైరవాచార్యుని ఉద్ధరించేందుకు సంకల్పించారే, ఆ శక్తి మీ కెక్కడినుంచి లభించింది?. అది

వారి దయే. చిన్నబాబూ, ఇదేవిధంగా పేదలను, ఆపదల్లో చిక్కుకున్నవారిని వారు ఉద్ధరించటం నేను అనేకసార్లు చూచాను.

రమే—[రెండుచేతుల్తో మొహాంకప్పుకొని] అయ్యో తండ్రీ!

గోపా—తెల్లవారవస్తోంది, యింక మీరు పడుకోండి చిన బాబూ!

రమే—సరే, నేను పడుకుంటాను; మీరు వెళ్ళండి.

[గోపాల్ వెళ్తాడు రమేశ్ నిద్రపోయే ప్రయత్నంలో వుంటాడు. ఇంతలో ద్వారంవద్ద ఎవరో వుండటంచూచి వులిక్కిపడతాడు]

యతీంద్రుడు—[లోపలికి తొంగిచూస్తూ] నేనే చినబావా!

రమే—[వాని దగ్గరకువెళ్ళి] నువ్వా యతిన్? ఇంతరాత్రివేళా? నన్ను పిలవటానికి వచ్చావా?

యతీం—అవును, మీ కోసమే.

రమే—నన్ను 'చినబావ' అనమని ఎవరుచెప్పారు?

యతీం—అక్క.

రమే—రమా? ఆమె నాతో ఏమైనా చెప్పిరమ్మన్నదా?

యతీం—కాదు, అక్క నన్నిక్కడికి తనతో రమ్మన్నది. అదేఁ, ఆమె యెదురుగా నుంచున్నది. [బయటికి చూస్తాడు]

రమే—[కంగారుగా ముందుకువచ్చి] ఏమిటి యివాళ నా కీ అదృష్టం? కాని నన్ను పిల్పించకుండా యింత రాత్రి వేళ నువ్వే వచ్చావేఁ? రా, లోపలికి రా.

[రమ అతిసంకోచితభావంతో లోపలికివస్తుంది. ద్వారందగ్గర్లోనే నేలమీద కూర్చుంటుంది. యతీంద్రుడు తన అక్కవద్ద కూర్చోబోతాడు] కాని రమేశ్ ఒక పడకకుర్చీని అక్కడికియీడ్చి దానిలో పడుకోబెడతాడు.

రమ—ఇంకెంతో ప్రొద్దులేదు; తెల్లవారవస్తోంది. నే నొక భిక్షకోసం వచ్చాను, ఇస్తారా, చెప్పండి.

రమే—నన్ను భిక్ష అడగటానికి వచ్చావా? ఆశ్చర్యం! చెప్పు, ఏంకావాలి ?

రమ—[తలయెత్తి, కొంచెంసేపు రమేశ్ వంక రెప్పవాల్చకుండా చూచి] ముందు మీరు మాటయివ్వండి.

రమే—[తల అడ్డంగా త్రిప్పి] ఊఁహూఁ, అలా యివ్వలేను. ముందు అడిగేదేమిటో తెలియనిదే మాటఇచ్చే శక్తి నాకులేదు రమా. దాన్ని నువ్వే నాశనంచేశావు.

రమ—నేను నాశనంచేశానా?

రమే—అవును, నువ్వే. ఆ శక్తి ప్రపంచంలో ఇంకెవ్వరికీ లేదు. నువ్వు నమ్మినా, నమ్మకపోయినా సరే, నే నిప్పుడు నీతో ఒక యదార్థవిషయం చెవుతాను రమా! కాని, ఆ వస్తువు నశించివుండకపోతే—శాశ్వతంగా నశించకపోతే బహుశా నే నీ సంగతి నీ కెన్నడూ చెప్పేవాడినేకాదు. కాని, ఇవాళ మన ఇద్దరిలో ఎవరికీ ఏమాత్రం హానిసంభవించే అవకాశంలేదు, కాబట్టే ఇప్పుడు బయటపెడుతున్నాను. ఆనాటివరకు నీకు ఇవ్వలేనిదనేది యేదీ నావద్దలేదు. కాని ఎందువల్లనో ఎరుగుదువా?

రమ—[తలాడించి] తెలియదు.

రమే—విని కోపగించుకోవద్దు, సిగ్గుపడనూవద్దు. ఏ ప్రాచీన యుగంనాటి విషయమో వింటున్నావనుకో. రమా, నేను నిన్ను ప్రేమించుతూండేవాణ్ని. నేను నిన్ను

కోరేనంతగా ఇంకెవరూ ఎవర్నీ ప్రేమించియుండరని అనుకునేవాణ్నే. మన కిద్దరికీ పెళ్ళవుతుందని చిన్న తనంలో అమ్మ అంటూంటే విన్నాను. తరువాత సర్వం కల్ల అయిపోయినరోజు వున్నదే—ఇన్ని సంవత్సరాలు గతించినా — నిన్న మొన్నటి సంగతిలాగే వున్నది.

[రమ రమేశ్ మొహంవంక చూచి ఒక్క క్షణం కంపించిపోతుంది. తల-ఒంచుకొని స్థబ్ధులా కూర్చునివుంటుంది]

రమే—నే నీ కథ అంతా చెప్పటం చాలా అన్యాయమని నువ్వు అనుకుంటూండవచ్చు. నా మనసులో కూడ ఈ సందేహం పీడిస్తూనేవుంది. అందువల్లనే ఆనాడు--తారకేశ్వరంలో కేవలం ఒక్కనాటినీ ఆదర-సత్కార ములతో నా జీవితస్రవంతినే మళ్ళించిననాడుకూడ చెప్పకుండా ఊరుకున్నాను. ఆనాడు నే నేమీ చెప్పకపోయినా ఆ నా మౌనంలోగల వ్యధ ఆ భగవంతుని కొక్కడికే తెలుసు.

రమ—[సహించలేక] ఆయనకు తెలిసినదాన్ని అక్కడే వుండనివ్వు రమేశ్ బావా!

రమే—అలాగే వుందిలే. రమా!

రమ—అయితే మరి మీఇంట్లోనే నన్నిలా అవమానించడం ఎందుకు?

రమే—అవమానమా? కాదు. ఇందులో గౌరవ అవమానాల ప్రసక్తే లేదు. ఇప్పుడే రమ—రమేశుల కథ

వింటున్నావో, ఆ రమవి నువ్వోకాదు, నేనూ ఆ రమేశ్‌ని కాదు.

రమ—రమేశ్ బావా! మీరు మీ స్వవిషయమే చెప్పండి. రమసంగతి మీకంటె నాకే బాగా తెలుసు.

రమే—ఏమైనాగాని, నామాట ఆలకించు; ఎందువల్లో నాకు తెలియదుగాని, నువ్వేమన్నా సరే, ఏంచేసినా సరే, నువ్వు నా అశుభాన్ని సహించలేవని నా కొనాళు దృఢవిశ్వాసం కలిగింది. చిన్నతనంలో నువ్వు నన్ను ప్రేమించిన సంగతి, నీచేత్తో నాకన్నీళ్లు తుడిచినవిషయం నువ్వు పూర్తిగా మరచిపోలేదనే అనుకున్నాను. అందువల్లనే, నీతో ఏమీ చెప్పకుండానే, నీ సేవను కూర్చొని, నా జీవితాశయాలను క్రమక్రమంగా నెరవేర్చుదామని నిశ్చయించుకున్నాను. కాని ఆ నాడు నువ్వే స్వయంగాపంపావని అక్బరునోటిమీదుగా విన్నతర్వాత—అరె, అదేమిటి? బయట ఆ గంద్రగోళం ఏమిటి?

[గోపాలుడు త్వరగా ప్రవేశం]

గోపా—చిన్నబాబూ! [చటుక్కున రమనిచూచి, సబుద్ధా ఆగిపోతాడు]

రమే—ఏం జరిగింది గుమాస్తాగారూ?

గోపా—పోలీసులువచ్చి భజ్జూని అరెస్టుచేశారు.

రమే—భజ్జూనా! ఎందుకూ?

గోపా—రాధాపురందోపిడిలో వాడూ వున్నాడని చెప్తున్నారు.

ర మే—స రే, నే వస్తున్నా, మీరుపదండి.

[గోపాల్ నిష్క్రమణ]

ర మే—యతీంద్రుడు నిద్రపోయాడు. వీనిని నిద్రపోనీ. కాని, నువ్వింక యిక్కడ ఒక్కక్షణం కూడ వుండవద్దు. దొడ్డిగుమ్మాన వెళ్ళిపో. పోలీసులు సోదాచేయక వదలరు.

రమ—[లేచినిలబడి, భయభీతకంఠంతో] మీ కేమీ పర్వా లేదు గద?

ర మే—అదేమీ చెప్పలేను రమా. వ్యవహారం ఎంతవరకు ముదిరిందో కూడ తెలియదు.

రమ—మిమ్మకూడ అరెస్టు చేయగలరా!

ర మే—ఆ, చేయవచ్చు.

రమ—దుండగం కూడ చేయగలరా!

ర మే— అదీ అసంభవ మేమీ కాదు.

రమ—[ఏడుస్తూ] ర మేశ్ బావా, నేను వెళ్ళను.

ర మే—[భయపడి] వెళ్ళవా !

రమ—వాళ్లు మీమీద అత్యాచారంచేస్తారు, మిమ్ము అవమానించుతారు, లేదు బావా, నేను వెళ్లను.

ర మే—[వ్యాకులస్వరంతో] ఛీ! ఛీ! నువ్విక్కడ వుండకూడదు. నీకు మతిచెండిదా రాణీ?

[రమేశ్ ఆమె చేయిపట్టుకుని బలవంతంగా బయటికి పంపుతాడు. అటువేపునుంచి చాలమందిపదధ్వనులు, కోలాహలం విన్పడుతాయి]

—o—

# తృతీయాంకము

## మొదటి దృశ్యం

[విశ్వేశ్వరి గది. విశ్వేశ్వరి, రమేశ్ ప్రవేశం]

విశ్వే—ఏం రమేశ్! నువ్వా పీఠ్‌పురం స్కూలుకే అంటి పెట్టుకొని వుంటావా? మా బడికి రావూ?

రమే—ఊం హూం, శ్రమ వ్యర్థమయ్యేచోట, ఒకరు మరొకరి మేలు చూడలేనిచోట, కష్టపడి శక్తిని వృథాచేసుకోవటం ఎందుకు? పైగా శత్రువులు ఎక్కువవుతారు. ఎవరిసేవచేస్తే దేశానికి మేలో ఆ మహమ్మదీయులు, తక్కువజాతి హిందువులకొరకే శ్రమపడటం మంచిది.

విశ్వే—ఇదేమీ క్రొత్తసంగతికాదు రమేశ్! ఇంతవరకు ప్రపంచంలో ఇతరుల సేవాభారం వహించినవారందరికి శత్రువులకేమీ తక్కువ లేదు. కాని ఆ భయంచే వెనుకంజవేసినవారిలోనే నువ్వూ కలసిపోతానంటే ఎలా నాయనా! ఈ భారం భగవంతుడు నీపైనే వుంచాడు; నువ్వే దాన్నివహించి ముందుకుపోవాలి. సరేగాని, రమేశ్, నువ్వు వాళ్ల చేతినీళ్లు తాగుతున్నావా?

రమే... [నవ్వి] ఇంతలోనే ఈ సంగతి నీచెవిని పడింది! కాని, నీ ఈ జాతిభేదాన్నే నేను అంగీకరించను పెద్దమ్మా!

విశ్వే—జాతిభేదాన్ని అంగీకరించవా? ఇదేమీ అబద్ధంకాదే. నువ్వు అంగీకరించకపోవటానికి అదేమీ వస్తుస్థ్రంకాదే!

రమే—జాతిభేదం వున్నదని అంగీకరిస్తాను; అది మంచిదని మాత్రం ఒప్పుకోను. దీనివల్ల ఎన్నో విరోధాలు, ఎంతో కీడు తటస్థించుచున్నవి. మనిషిని నీచంగా ఎంచి అవమానించిన దాని ఫలితాన్ని నువ్వు చూడటంలేదూ పెద్దమ్మా? చేతిలో డబ్బు లేనందువల్లనే ఆవాళ ద్వారకానుహారాజు [రాజు కాదు] కు ప్రాయశ్చిత్తం జరగటానికి వీల్లేకపోయింది. ఆ కారణంవల్లనే ఆయన మృతదేహాన్ని కూడ ఎవరూ ముట్టుకోవటానికి యిష్టపడలేదు. ఇవన్నీ నువ్వెరుగవూ?

విశ్వే—తెలుసు, అంతా యెరుగుదును. కాని వీటన్నిటికీ జాతిభేదం కారణంకాదు. దీనికి ముఖ్యకారణం పూర్వం వున్నదీ—యదార్థధర్మమనుకున్నదీ ఇప్పుడు గ్రామాల్లో మృగ్యంకావటమే. యిప్పుడు మిగిలివున్నవల్లా అర్థం లేని ఆచారకుసంస్కారాలు, వాటిమూలంగా యేర్పడిన అనవసర కట్టుబాట్లూను.

రమే—మరి దీనికి ప్రతిక్రియ లేదా?

విశ్వే—ఎందుకులేదు నాయనా! జ్ఞానమే దానికి ప్రతిక్రియ. నువ్వు అడుగిడినమార్గమే దానికి ప్రతీకారం కాగలదు. కాబట్టే నీ స్వగ్రామం వదలిపెట్టి పోవద్దని నీతో పదే పదే చెపుతున్నాను బిడ్డా! నీలాగే పట్నాలకుపోయి విద్యాబుద్ధులుపొంది పల్లెటూళ్ళకు తిరిగివచ్చి, స్వగ్రామాల్లో వుండిపోతే, సంబంధంలేకుండా పట్నాల్లోనే వుండిపోకుండా వుంటే గ్రామసీమలకీ దుర్గతిపట్టేదికాదు.

అలాంటివారు గోవిందునివంటివారిని నెత్తికెక్కించు
కొని, నీలాంటివారిని దూరంగా తరుమరు.

రమే—కాని దూరంగా వెళ్ళిపోవటానికి నాకేమీ విచారం
లేదు పెద్దమ్మా!

విశ్వే—కాని ఈ దుఃఖమే అన్నిటినిమించిన దుఃఖం రమేశ్!
నువ్వీ విధంగా మధ్యలోనే అన్నీవదిలేసి వెళ్తే నీ
మాతృభూమి నిన్నెన్నడూ క్షమించదురా అబ్బాయి!

రమే—జన్మభూమి నా ఒక్కడికేకాదుగా పెద్దమ్మా?

విశ్వే—నీ కొక్కడికే తల్లి నాయనా! తల్లి తననోటితో బిడ్డల
నేమీ అడుగదు. కాబట్టే ఇంతమందిలో ఎవరికైనా
ఆమె రోదనం వినపడిందా? కాని, వచ్చీరావటంతోనే
నువ్వు నీ తల్లి యేడ్పు విన్నావు.

రమే—[కొంచెంసేపు తలవంచుకొనిమౌనంగావుండి] పెద్దమ్మా,
నిన్నొకసంగతి అడగనా?

విశ్వే—ఏ సంగతి?

రమే—నేను నీ యీ జాతిభేదాన్ని అంగీకరించుటలేదు సరే
గాని, నువ్వు పాటిస్తున్నావా?

విశ్వే—నువ్వు పాటించకపోతే నేనూ పాటించనా?

రమే—నేను ఎవరు ముట్టుకున్నదైనా తింటున్నాను. మరి
నేను స్పృశించినది నువ్వు తినకూడదుగా?

విశ్వే—ఎందుకు తినగూడదు? నువ్వు నా బిడ్డవి. అదీ అంతంత
మాత్రంగా కాదు. నా పెద్దకొడుకువి. నేను
స్త్రీనై వుండి అంతమూర్ఖపుమాట అనగలనా?

రమే—[వంగి పెత్తల్లిపాదధూళి శిరస్సునవేసుకొని] పెద్దమ్మా, నేను నిన్ను బాగాఅర్థంచేసుకోగలిగేటట్లు ఆశీర్వదించు.

విశ్వే—[అతని చుబుకంపట్టుకొని, ముద్దుపెట్టుకొని] చాలు చాలు. ఇంకా నాపూజా-పునస్కారాలు కాలేదు. కాస్సేపు కూర్చుంటావా నాయనా?

రమే—లేదు పెద్దమ్మా, నాకు బడివేళఅయింది.

విశ్వే—అయితే సరే, తీరికగావున్నప్పుడు వస్తూండు.

[ఇద్దరూ నిష్క్రమణ]

[రమ, దాసి చెరోవైపునుంచి ప్రవేశం.]

రమ—రాధా, పెద్దత్త యేదీ?

రాధ—ఇప్పుడే పూజకువెళ్లారమ్మా. త్వరగానే వస్తారు, కూర్చోండి.

[వేణీ ప్రవేశం. అతనురాగానే దాసి వెళ్ళిపోతుంది]

వేణీ—నువ్వు రావటంచూచే వచ్చాను రమా. నీతో చాలా విషయాలు మాట్లాడాలి. అమ్మ పూజకు వెళ్లిందా?

రమ—రాధ అలాగనే చెప్పింది.

వేణీ—అనేక యెత్తుపై యెత్తులు ఆలోచించి పని చెయ్యాలమ్మా. లేకపోతే శత్రువును వంచలేము. ఆవాళ యజమాని పంపితే భజ్జా భుజాన లాఠీపెట్టుకొని చేపల కోసం నీ ఇంట్లోకే వచ్చాడుగదూ? ఆ సంగతి నువ్వు ఆవాళే రిపోర్టు ఇచ్చివుండకపోతే ఇవాళ వాడిని జైల్లో పెట్టించగలిగేవాళ్ళమూ! అప్పుడే నువ్వో మరోనాలుగు మాటలు కల్పించి రమేశ్ పేరుకూడా యిరికించివుంచేనా! కాని, అప్పట్లో మీరెవరూ నా మాట విన్లేదు. ఎబ్బే! అక్కర్లేదు, నువ్వో సాక్ష్యమేమీ

ఇవ్వనక్కర్లేదులే, కంగారుపడకు. ఒకవేళ వెళ్ళాల్సి వస్తేమట్టుకు తప్పేముంది? జమీని సురక్షితంగా వుంచుకోవాలంటే వెనక్కి తగ్గకూడదు——రమేశ్ కూడా మన తాతగారిచ్చినది రెండుచేతులా నాశనంచేశాడు. వీర్‌పురంలో స్కూలుపెట్టాడు. అసలే కురకలకు హిందూ జమీందార్లంటే యిష్టంలేదు. ఇంక చదువు-సంధ్యలు అలవడితే మరి మనకు జమీలు వున్నా లేకపోయినా ఒకటే. నేను ముందేచెప్తున్నాను సుమా.

రమ——సరేగాని పెదబావా, ధనమూ, జమీ నష్టమైతే రమేశ్ బావకిమాత్రం దెబ్బకాదూ?

వేణీ——[ఆలోచించి] కాని, నీకు తెలియదు రమా——అలాంటి వ్యవహారాల్లో తమ నష్టంసంగతే ఆలోచించరు. మన మిద్దరం చిక్కుల్లోపడితేనే వాడికి సంతోషం. ఇక్కడికి వచ్చినలగాయతు డబ్బు నెలా వూడేస్తున్నాడో చూస్తున్నావుకదా ? అలగా జాతిజనంలో 'చినబాబు చినబాబు' అని ఒకటే కలవరింతలు ! కాని అది ఎన్నాళ్ళో నిలవదులే. నువ్వు వాడిని పోలీసుదృష్టిలో పెట్టావే అదే వాడిని నాశనంచేసితీరుతుంది.

రమ——నేనే రిపోర్టు వ్రాయించానని రమేశ్ బావకి తెలుసా?

వేణీ——నాకు సరిగా తెలియదుగాని. ఈసంగతి వానికి తెలియకుండావుండదు. భజ్జూవ్యవహారంలో అన్నిసంగతులు బయటపడకుండా ఎలావుంటాయి?

రమ——[కాస్సేపాగి] మరి పెదబావా, ఇప్పుడు అందరినోటా ఆయనపేరే వినపడుతోందేమిటి?

వేణీ—నిజమే. కాని, రమా, నేను వాడిని సులభంగా వదుల్తానా? వాడు అందరినీ చదివించి పాడుచేస్తూంటే నేను జమీందారునై వుండి మెదలకుండా కూచుంటానని ఎవరూ కలలోకూడ అనుకోకూడదు. ఇప్పుడీ వెధవ భైరవస్వాము ఛజ్జూగాడితరఫున సాక్ష్యంచెప్పి తనకూతురు పెళ్ళి యెలాచేస్తాడో చూడాలి !

రమ—ఏమిటి బావా, మీ రనేది?

వేణీ—ఒకసారి వూపిచూడనూ? నాకు వ్యతిరేకంగా సాక్ష్యమిచ్చి ఈ వూళ్ళోవుంటాడా? చూస్తానుగా! ఈ ఆచారిగాడు జెల్ల చేప! పెద్దపెద్ద చేపలుకూడావుంటై. దీనికి గంగూలీగా రేమంటారో చూడాలి. ఇక్కడ దొంగతనాలు జరుగుతూనేవుంటాయి. ఈసారి నౌకరును జైలుకు పంపితే, తర్వాత యజమానిని పంపటానికి ఏమంత కష్టంవుండదు.

రమ—[అమితాశ్చర్యంగా] ఏమంటున్నావు పెదబావా? నువ్వు రమేశ్ బావని జైలుకు పంపుతావా?

వేణీ—ఏం? వాడేమైనా మహానుభావుడా? చేతికి చిక్కినప్పుడు వూరకే వదుల్తామా? నువ్వు బలేగా చెప్తున్నావే!

రమ—[కోమలకంఠంతో] రమేశ్ బావ జైలుకువెళ్తే మనకు మాత్రం కళంకం కాదూ?

వేణీ—ఎందుకని? మనకు కళంక మేమిటి?

రమ—మనకు ఆత్మీయుడేగద! మనం కాపాడకపోతే అందరూ మనమీద ఉమ్మివేయరూ?

వేణి—చేసుకున్నవాడు అనుభవించుతాడు; ఇందులో మన కేం సంబంధం?

రమ—రమేశ్ బావ దోపిడీ, దొంగతనాలు చేస్తూ తిరుగటం లేదే. ఇతరుల మేలుకోసమే తనదంతా ఖర్చుపెడుతున్నాడని ఎవరూ యెరుగనిది కాదు. తర్వాత మనం వాళ్ళ మొహ మెలా చూపగలం?

వేణి—ఏమిటి అమ్మాయ్, నువ్విలా అయిపోయావేమిటి?

రమ—మన మొహంముందు ఏమీ అనలేకపోవచ్చుగాని, వెనకఅయినా జనం చెప్పుకోనక మానరు. ఏపు వెనుక రాజమాతను కూడ పిశాచమంటూ రంటారు మీరు. కాని భగవంతుడున్నాడు. నిరపరాధిని అన్యాయంగా శిక్షింపజేస్తే ఏవిధంగానూ వదలిపెట్టడు.

వేణి—అయ్యో దౌర్భాగ్యమా! ఆ వెధవ దేవతలను, దేవుణ్ణి ఒప్పుకుంటాడా? శివాలయం పడిపోతూంటే, మరమ్మత్తు చేయించడానికి చందాకోసం మనుష్యులను పంపితే 'వ్యర్థకార్యాలకు ఖర్చుపెట్టడానికి నాదగ్గర డబ్బులేదని మిమ్మల్ని పంపినవాళ్ళతో చెప్పండి' అన్నాడు. విను వాడిమాట! ఇదేమో అనవసర ఖర్చు, నీచజాతివాళ్ళ కోసం స్కూలు పెట్టటం అవసరఖర్చు! బ్రాహ్మణుడై వుండికూడా సంధ్యావందనం వగైరా చేయడే. తురకల చేతినీళ్ళుకూడా తాగుతున్నాడని వింటున్నాము. అమ్మాయ్, నాలుగుకాయితాలు ఇంగ్లీషు చదివాడుగా, యింకా వాడికి ధర్మము, ఆచారాలు ఎందుకు?

నాడీపాపం ఏమవుతుంది? అంతా ప్రోగుపడుతున్నదని ఒకనాడు అందరూ తెలుసుకుంటారు.

[రమ మాట్లాడదు]

వేణు—ఇంక నేను వెళ్తున్నాను. వీలైతే నిన్ను మరొకసారి కలుసుకుంటాను. బహుశా గంగూలీగారు వచ్చి బయట కూచునివుంటారు.

రమ—నేనూ వెడుతున్నాను పెదబావా.

[ఇద్దరూ నిష్క్రమణ]

రమేశ్—[ప్రవేశించి] రాధా, రాధా!

దాసి—[ప్రవేశించి] ఏమిటి చినబాబూ?

రమే—పెద్దమ్మ పూజనుంచి వచ్చిందా? ఇందాక ఒకసంగతి చెప్పటం మర్చిపోయాను.

దాసి—రాలేదు; యిప్పుడే వస్తారు; కూచోండి.

రమే—కాదు, మళ్లీ సాయంత్రం వస్తానన్నానని చెప్పు.

దాసి—అలాగే లెండి,

[గబగబా గోపాల్ ప్రవేశం]

రమే—మీ రిలా వచ్చా రేమిటి?

గోపా—మీకోసం యెదురుచూస్తూ కూర్చోవటానికి వీల్లేదు చిన్నబాబూ! మీ కోసం అన్నివేపులా వెతుకుతూ తిరుగుతున్నాను. భైరవాచార్యుని సంగతి మీరు విన్నారా? మన కెలా దెబ్బకొట్టాడో తెలిసిందా బాబూ?

రమే—లేదే! ఏం జరిగింది?

గోపా——నాన్నగారు స్వర్గానికి వెళ్లినప్పుడు ఆ శోక-దుఃఖంలో ఇం కేమీవద్దు, శాంతిగా బ్రతుకుదా మనుకున్నాను. కాని, ఇక నన్ను మీరూ ఆపలేరు చిన్నబాబూ. ఆచార్యుడికి తాను చేసినదానిఫలితం రుచిచూపిస్తాను. నేను దీనికి తప్పకుండా బదులుతీరుస్తాను. నే నిప్పుడే కోర్టుకు వెళ్తున్నాను.

రమే——అసలు విషయం ఏమిటి గుమాస్తాగారూ? ఇంతకూ భైరవాచార్యుడు ఏం చేశాడేమిటి, శాంతపురుషులు మీరే యింత వుద్రేకపడుతున్నారు?

గోపా——అత డేం చేశాడంటున్నారా? విశ్వాసఘాతకుడు! వాని యిల్లూ-వాకిళ్లు జప్తు అవుతున్నాయంటే, కానీ మన కెందుకు అనుకున్నాను. కాని, స్వర్గంలో యజమాని దుఃఖిస్తారని భయపడి, వారిస్వభావం యెరిగి వున్నందున మీకు అడ్డు చెప్పలేకపోయాను.

రమే——కాని నా కేమీ బోధపడటంలేదు గుమాస్తాగారూ.

గోపా——ఆవాళ మీ ఆజ్ఞానుసారం నేను కోర్టుకువెళ్ళి, అతని డిక్రీసొమ్ము చెల్లించి, ఫోర్జరీకేసుకు యేర్పాటుచేసి వచ్చాను. కాని మొన్న భైరవాచార్యుడు వెళ్ళి, కేసు ఎత్తివేసుకున్నట్లు స్వయంగా దరఖాస్తు దాఖలు చేశాడనీ, అది మంజూరైనదనీ ఇంతకుముందే తెలిసింది.

రమే——అంటే?

గోపా——అంటేనా? మనం జమకట్టిన మొత్తం అంతా నష్టమయింది. మన పుచ్చెలు పగులగొట్టి ఆ ముగ్గురూ— గోవిందగంగూలీ, వేణీబాబు, అతడు పంచుకొని

తింటారు. ఉదయాన్నుంచీ ఆ భైరవుడి కొంపముందు సన్నాయిమేళం వినపడుతోంది— మీరు వినలా? మనమరాలి అన్నప్రాశన మహాఆడంబరంగా జరుగుతుంది. మన డబ్బుతోనే బ్రాహ్మలంతా ఫలహారం ఆరగించుతారు. తమాషా ఏమిటంటే మీకు పిలుపు లేదు. అక్కడి ఆధ్వర్యం అంతా గంగాలీదే. వాళ్లు మిమ్మల్ని కులంలోంచి బహిష్కరించారు.

రమే—భైరవాచార్యుడా? ఇంతపని చేయగలిగాడా?

గోపా—ఎందుకు చెయ్యలేదు? యిప్పుడు పల్లెటూరి పెద్దమనుషులు చేయలేని దేమిటా అనేదే తెలుసుకోవాలి. సరే, నే వెళ్తున్నాను.

రమే—వెళ్ళండి. మహాపాతకుడికి ప్రాయశ్చిత్తం ఏమిటా అనే నే నాలోచించుతున్నాను.

గోపా—నాసాక్ష్యం వుంది చిన్నబాబూ, నేను వానిని వూరకే వదుల్తానా?

[ని ష్క్ర మ ణ]

రమే—న్యాయచట్టం ఏముంటుందో తెలియదు. కృతఘ్నతకు ఏదైనా శిక్షవున్నదో లేదోకూడ తెలియదు. ఇక ఆ విషయం వదలి, నేను స్వయంగానే ఈ భారం వహిస్తాను. కేవలం సహించుతూవుండడమే ప్రపంచంలో పరమధర్మంకాదు.

[ని ష్క్ర మ ణ]

## రెండో దృశ్యం

[భైరవాచార్యుని యింటిముందుభాగం. దౌహిత్రి అన్నప్రాశన. మామిడాకుల తోరణాలు కట్టబడివుంటాయి. ముందు ఒకప్రక్కన సన్నాయి భజంత్రీలు కూర్చున్నారు. ఒకడు నవ్వూతూంటే, ఒకడు చుట్ట కాలుస్తుంటాడు. వైష్ణవ దంపతులిద్దరు కీర్తన పాడుతున్నారు. మిగతా జనం ఆనందంగా వింటున్నారు. గీతాలాపన అయినతర్వాత దీనూభట్టాచార్య హుక్కా క్రిందపెట్టి బయటికి వెళ్ళబోతాడు. ఇంతలో రమేశ్ వస్తాడు. అతన్ని చూస్తేనే చాలా వుద్రేకంగావున్నట్లు తెలుస్తుంది. అతని ఆకస్మిక ఆగమనంతో అందరూ గాబరాపడతారు.]

రమే—ఆచార్యులుగారు ఏరీ?

దీనూ—[సమీపించి] వెళ్ళు వెళ్ళు; ఇంటికి తిరిగి వెళ్ళు బాబూ. భైరవాచార్యునికి నువు చేసిన ఉపకారం ఆయన బాబు కూడా చేసివుండడు. కాని ఏం ప్రయోజనం? అందరూ పిల్లా-జెల్లలతో సంసారాలు చెయ్యాలయ్యె! ఆయన నిన్ను పిలిస్తే—తెలిసిందికదూ బాబూ?—భైరవునిదీ ఏమంత దోషంలేదు. మీకు జాతీ-గీతీ లేదాయె. ఇందువల్లే—తెలిసింది కదూ బాబూ? రెండురోజుల్లో ఆయన చిన్నకూతురు పెళ్ళి అవుతుంది. పిల్లకి పన్నెండేళ్ళు వచ్చాయి. మరి ఎలాగో సాగనంపాలిగదా. మన సంఘంసంగతి నీకు తెలుసుగా బాబూ—

రమే—అవును నేను అంతా తెలుసుకున్నాను లెండి. కాని ఆయన ఎక్కడున్నాడో చెప్పండి.

దీనూ—ఉన్నాడు, యింట్లోనే వున్నాడు. నేను ఆ బ్రాహ్మడికిమాత్రం ఎలా దోషమారోపించేది? [అందరివంక

చూచి] మాబోటి ముసలివాళ్ళకు పరలోక భయం కూడా...

రమే—అవునవును, అది సరేగాని, ఆయన ఏడీ?

భైర—[ప్రవేశించి, వేణీబాబుతో] చూడండి పెదబాబూ, తన్నాతె తమకు కష్టంకలిగితే—[అకస్మాత్తుగా రమేశ్ నుచూచి వజ్రాహతునిలా స్తబ్ధుడైపోతాడు]

రమే—[చరాలున ముందుకువెళ్ళి, గట్టిగా చేయిపట్టుకొని]. అలా ఎందుకు చేశావ్? ఇవాళ నేను...

భైర—పెద్దబాబూ, గంగూలీగారూ, చూడండి. ఒకసారి—

రమే—[గట్టిగా ఒక్క తోపు త్రోసి] ఇవాళ పెదబాబుకీ, గంగూలీకి—అందరికీ చూపిస్తాన్లే—చెప్పు, ఈపని ఎందుకు చేశావ్?

[వేణీ వగైరా చప్పున జారుకుంటారు]

భైర—[ఏడ్చి] ఓ లక్ష్మీ! త్వరగాపోయి పోలీసులతో చెప్పిరా. అరె, చంపివేశాడే—

రమే—నోర్ముయ్. అలా ఎందుకుచేశావో చెప్పు.

భైర—అయ్యబాబో! చంపేశాడు!

రమే—ఆఁ, చంపేస్తాను. ఇవాళ నిన్ను ఖూనీచేయకుండా వెళ్ళను. [అని విసురుగా తోస్తుంటాడు,]

[లక్ష్మి వచ్చి ఓగ్గరగా ఏడుస్తూంటుంది. ఇంతలో చాలమంది జనం వచ్చి తొంగిచూస్తుంటారు. రమ చరచర ప్రవేశిస్తుంది.]

రమ—[రమేశ్ చేయిపట్టుకొని] చాలు, ఇకచాల్లే, వదిలిపెట్టు.

రమే—ఎందుకని?

రమ—ఈ మనిషిమీాదా మీారు చెయిచేసుకునేది?

రమే—నేను వీనిని ఇవాళ ఏవిధంగాను వదల్ను.

రమ—ఇంతమందిలో మీకు సిగ్గులేదుగాని, నేను సిగ్గుచే చచ్చిపోతున్నాను. వెళ్ళండి, ఇక యింటికివెళ్ళండి.

రమే—[కొంచెంసేపు విహ్వలదృష్టితో ఆమెవంక చూస్తూ వుండి] సరే, ఇంటికే వెళ్తున్నాను.

[రమేశ్ చరచర వెళ్ళిపోతాడు. తర్వాత వేణీ, గంగూలీ వగైరా అందరూవచ్చి చేరుకుంటారు. భైరవుడు నేలమీద మోకాళ్ళమధ్య తలపెట్టుకొని కుములుతూంటాడు]

గోవిం—ఇంటిపైకివచ్చి కొట్టిపోతాడా! ఇప్పుడు దీని కేంచెయ్యాలో ఆలోచించాలి.

వేణీ—నేనూ అదే చెప్తున్నాను.

రమ—కాని, ఈయన దోషమూ తక్కువదికాదు పెదబావా! అయినా గోరంతలు కొండంతలుచేయడానికి ఏం జరిగిందని?

వేణీ—ఏమంటున్నావు రమా? ఇదేం సామాన్యవిషయమా? మనమందరం లేకపోతే ఈయన్ని ఖూనీచేసివేసేవాడు.

రమ—చెయ్యాలనుకుంటే మనం ఆపగలిగేవాళ్ళమే కాదు.

లక్ష్మి—నువ్వాయన తరఫున మాట్లాడుతున్నావా రమ అక్కా! ఎవరైనా యింట్లో చొరబడి మీ నాన్నని కొడితే నువేంచేసేదానవు?

రమ—లక్ష్మీ, నీ తండ్రికీ మా తండ్రికీ చాలా భేదంవుంది. వారిద్దరినీ పోల్చవద్దు. నేనెవరితరఫునా మాట్లాడను. మంచికే చెపుతున్నాను.

లక్ష్మి—అలాగా! ఆయనతరఫున జగడమాడటానికి నీకు సిగ్గు లేదూ? కలవారి పిల్లవని ఎవరూ ఎదుట అనటంలేదు గాని, ఎవరికి తెలియదు నీ సంగతి? నువ్వు కాబట్టి ఇంకా మొహంచూపిస్తూ తిరుగుతున్నావుగాని, మరొకతె అయితే మెడకు వురివేసుకొని చచ్చేది.

వేణి—లక్ష్మి, నువ్వూరుకో, నీ కెందుకు ఆ విషయాలన్నీ?

లక్ష్మి—ఏం, నా కెందుకు అవసరంలేదు? నాన్నగారి యింత దుఃఖానికీ కారకుడైనవాని తరఫున పోట్లాడుతుందా? ఇవాళ నాన్నగారు చచ్చిపోతే?

రమ—లక్ష్మి, అలాంటి మనిషిచేతిలో చావటంకూడా అదృష్టమే! మీ నాన్నే ఇందాక చచ్చిపోతే స్వర్గానికి వెళ్ళేవాడు.

లక్ష్మి—బహుశా అందుక నేనా నువ్వూ ఆయనచేతిలో నే చిక్కావు!

రమ—[కొంచెంసేపు ఆమెవంకే చూస్తూవుండిమొహం త్రిప్పి] కాని, ఏమిటిసంగతి పెదబావా, నువ్వే చెప్పు?

వేణి—నాకేం తెలుసు అమ్మాయి? లోకులు అనేకం చెప్పు కుంటారు, వాటి నన్నిటినీ పట్టించుకుంటే యెలా?

రమ—లోకులు ఏమనుకుంటున్నారు?

వేణి—చెప్పుకుంటే చెప్పుకోనీ, లోకులమాటల్తో శరీరంమీద బొబ్బలెక్కుతాయా యేమిటి? అనుకోనిద్దూ.

రమ—నీ శరీరంమీద దేనివల్లా పుండ్లుపడవులే. కాని అందరి శరీరాలమీదా ఖడ్గమృగం చర్మంలాంటిదే వుండదు.

ఇంతకూ ఆలోకులచేత ఈమాటలు అనిపించేది ఎవరు? మీరా!

వేణీ—నేనా?

రమ—అవును, మీరుకాకపోతే యింకెవరు? మీరు చేయని చెడుపని ఏముంది ఈ ప్రపంచంలో? ఫోర్జరీ, దగా, దొంగతనం, ఇండ్లకు నిప్పంటించడం—అన్నీ అయినై. ఇంక ఇదిమాత్రం ఎందుకు మిగిలిపోవాలి? స్త్రీకి ఇంతకు మించిన సర్వనాశనం యింకేదీ వుండదని గ్రహించే శక్తి మీకులేదు. కాని మీ కింత కౄరత్వం ఎందుకో! ఈ వాదు వేసినందువల్ల మీకు కలిగేలాభం ఏమిటి?

వేణీ—నా కేం లాభం? నువ్వు రాత్రివేళ రమేశ్ ఇంట్లోనుంచి వస్తూ ఇతరులకంటపడితే, దానికి నే నేంచేయగలను?

రమ—ఇంతమందియెదుట నేను మిగతా సంగతులన్నీ చెప్ప దలచుటలేదు. కాని, నేను మీ మనోభావం యెరుగనని తలచకండి పెదబావా. నేను రమనని బాగా జ్ఞాపకంవుంచుకోండి. నే చచ్చేటట్టయితే మిమ్మాత్రం బ్రతకనివ్వను [అని చరచర వెళ్ళిపోతుంది]

గోవిం—పెదబాబూ ఏమి టీ విడ్డూరం! నిన్నూ బెదరించి పోయిందే? ఆడదయివుండికూడా! ఈ జీవితంలో అది కూడా కళ్ళచూడాలి కాబోలు!

వేణీ—[తన లలాటం స్పృశించి] ఇందులో ఇంకెవరిదోషమూ లేదు. దోషం నాదేలెండి. ఇది కలికాలం, దీనినే కాలమహాత్మ్యం అంటారు. నేటివరకు ఒకరికి మేలు చేయుటం తప్ప ఎవరికీ అపకారం మనసులోనైనా తల

పెట్టలేదు. నాకు కాకపోతే ప్రపంచంలో ఇంకెవరికి కలుగుతుంది యీ స్థితి? విద్యాసాగరునికి ఏంజరిగింది? మీా కెరుగరా?

గోవిం—ఎరుగకేం?

వేణీ—సరిగ్గా నాకూఅంతే. [భైరవుని చూపుతూ] ఈయన్ని కాపాడటానికి బయటికి రాకుంటే ఇంకేమీా జరిగేది కాదు. కాని ఒకర్ని కష్టంలోచూచి వూరుకోవడం నాప్రాణం వుండగా జరగదు!

## మూ డో దృ శ్యం

[నిర్జన మార్గము. రమేశ్ త్వరగా నడుస్తుంటాడు. చాటునుంచి 'రమేశ్ బావా!' అని పిల్చి తర్వాత రమ ముందుకువచ్చి నిలబడుతుంది]

రమే—రమా! ఇంతదూరాన ఈ నిర్జనమార్గంలో నువ్వా?

రమ—పీర్‌పురంస్కూలునుంచి మీారీ దారినే వస్తారని నాకు తెలుసు.

రమే—అవును నమకో. కాని నువ్వెందుకువచ్చావ్?

రమ—మీా ఆరోగ్యం బాగుండడంలేదని విన్నాను. ఇప్పు డెలా వుంది?

రమే—బాగుండలేదు. రోజూ రాత్రుళ్ళు జ్వరంతగిలి నట్టుంటోంది.

రమ—అయితే కొన్నాళ్ళపాటు యెక్కడికైనా వెళ్లిరావటం మంచిది !

రమే—నేనూ అలాగే అనుకుంటున్నాను; కాని అదెలా కుదురుతుంది? [నవ్వుతాడు]

రమ—నవ్వుతారేం? చాలాపనులు వున్నాయని చెపుతారు, కాని శరీర రక్షణకంటె ఎక్కువైన పనేముంటుంది?

రమే—దేహం నిర్లక్ష్యం చేయువలసినదికాదని నేనూ ఒప్పుకుంటాను. కాని మానవునికి దేహానికిమించిన కర్తవ్యాలుకూడా వుంటాయి. అది నీకు అర్థంకాదు రమా!

రమ—నాకు తెలుసుకోవాలనికూడా లేదు. కాని మీరు యెక్కడికైనా వెళ్లకతప్పదు. మీ జమీ వ్యవహారాలు నేను చూస్తుంటానులెండి, గుమాస్తాతో యీ సంగతి చెప్పివెళ్లండి.

రమే—నా వ్యవహారాలు నువ్వు చూస్తావా?

రమ—ఏం, ఎందుకుచూడలేను?

రమే—చూడగలవనుకో—నాకంటే నువ్వే బాగా చూడవచ్చు. కాని ఆ అవసరం లేదు నిన్ను విశ్వసించడ మెలాగు?

రమ—రమేశ్ బావా, ఇంకెవరు విశ్వసించలేకపోయినా మీరు విశ్వసించగలరు. మీరే విశ్వసించలేకపోతే ఇంకీ ప్రపంచంలో విశ్వాసమన్నదే ఎగిరిపోతుంది. మీ రా భారం నాపై వదలివెళ్లండి.

రమే—[కొంచెంసేపు మౌనంగా ఆమెమొహంవంకచూచి] సరే, ఆలోచించుతాన్లే.

రమ—ఆలోచించడానికి వ్యవధిలేదు. ఇవాళే మీరు ఇక్కడి నుంచి వెళ్లిపోవాలి. వెళ్ళకపోతే—

రమే—[మళ్ళీ రెప్పవాల్చకుండా ఆమెవంకచూచి] నీమాటలనుబట్టి, నేను వెళ్ళకపోతే ఏదో ఆపద రావచ్చునని

తెలుస్తోంది. సరే, నేను వెళ్తాననుకో, కాని ఇందు వల్ల నీ కేం లాభం? ఇవాళ ఏదో ఆపదనుంచి తప్పించా లని హెచ్చరించడానికి వచ్చావే—ఇదివరకు నువ్వే నాకు ఆపదకలిగించడానికి ప్రయత్నించావుగా! అవి మర్చిపోవడానికైనా ఎన్నాళ్ళో కాలేదే! ఇంతకూ నేను వెళ్ళిపోతే నీకు ఏంలాభమో నాకు స్పష్టంగా చెప్పు. అది వింటే నేను అంగీకరించగలనేమొ!

[ఈ కఠోరమైన దెబ్బతో రమమొహంలో రంగుమారింది. అయినా ఆమె తమాయించుకుంటుంది.]

రమ—స్పష్టంగా చెప్పేస్తున్నాను. మీరు వెళ్ళడంవల్ల నా కేమీ లాభంలేదుగాని, వెళ్ళకపోతే చాలా హాని జరుగుతుంది. నేను సాక్ష్యం చెప్పవలసివస్తుంది.

రమే—ఇంతే! ఈ స్వల్పవిషయానికేనా? నువ్వు సాక్ష్య మివ్వ కపోతే?

రమ—నేను సాక్ష్యం చెప్పకపోతే, దుర్గాపూజనాడు నా యింటికి ఎవరూ రారు; జతిన్ వడుగుకు ఎవరూ భోజ నానికి రారు. యింకా పూజా పునస్కారాలేవీ—కాదు. బావా, మీరు వెళ్ళిపొండి. నేను బ్రతిమాలుకుం టున్నాను. ఇక్కడేవుండి నన్ను నాశనంచేయొద్దు. మీ రిక్కడనుంచి వెళ్ళిపొండి!

రమే—[కొంచెమాగి] సరే నేను వెళ్ళిపోతాను. కాని నేను ప్రారంభించినపని పూర్తిచేయకుండానే వెళ్తాను కాని, నా ఆత్మ కేం సమాధానం చెప్పుకోను?

రమ—దీని కేమీ జవాబులేదు. ఇం కెవరైనా అయితే

సమాధానానికి కొదువ లేదు; కాని, రమేశ్ బావా, ఒక అతి క్షుద్ర స్త్రీ అఖండ స్వార్థపరత్వానికి మీకు జవా బెక్కడ లభిస్తుంది? మీరు నిరుత్తరులయ్యే వెళ్లి పోవాలి.

రమే—సరే, అలాగే జరుగుతుంది. కాని నేను ఇవాళే వెళ్ల లేను.

రమ—నిజంగా వెళ్లరా?

రమే—వెళ్ళను. నీతో వచ్చినమనిషిని యిటు రమ్మను.

రమ—నాతో యిం కెవరూ రాలేదు. నేను ఒంటరిగానే వచ్చాను.

రమే—ఒంటరిగా వచ్చావా? ఇదేమిటి? ఏ ధైర్యంతో ఒంట రిగావచ్చావు రాణీ?

రమ—మీరీదారినే తప్పకవస్తారని నాకునిశ్చయంగా తెలుసు. నాకు భయమెందుకు?

రమే—నువు చేసినది మంచిపనికాదు రమా! కనీసం నీ దాసి నైనా వెంట తీసుకురావలసింది. ఈ నిర్జనమార్గంలో నువు నాకైనా జడవాలే.

రమ—మీకా? నేను మీకు భయపడనా?

రమే—ఏం, ఎందుకు భయపడవు?

రమ—[తలాడించి] లేదు, ఏవిధంగాను భయంలేదు. రమేశ్ బావా, మీరు నా కిం కేమి వుపదేశించినా వింటాను గాని, మీకు భయపడాలనిమాత్రం నన్ను భయపెట్ట వద్దు.

రమే—నీకు నాయందింత తృణీకారభావమా?

రమ—ఆ, తృణీకారమే. దాసిని వెంట తీసుకురాలేదన్నారే, ఎందుకు తీసుకురావాలో చెప్పండి? మీ నుంచి కాపాడుకోవటానికి దాసిని సహాయం తెచ్చుకుంటా ననుకున్నారా? అయితే మీముందు దాసి రమకంటె ఎక్కువదా?

[రమేశ్ మెదలకుండా ఆమెమొహంవంక చూస్తుంటాడు]

రమ—[పొద్దుటసంగతి జ్ఞాపకం లేదూ? అక్కడ జనం తక్కువమంది లేరే. కాని, మీ ఉగ్రమూర్తిని చూచి అందరూ పారిపోతే భైరవాచార్యుని రక్షించింది ఎవరు? ఈ రమే కదూ, అప్పుడు ఏ దాసీ, నౌకరుల సహాయమూ అవసరం లేకపోతే, ఇప్పుడుమాత్రం ఎందుకు? ఆఁ, ఇకనుంచి మీరే రమకు భయపడండి. ఇది చెప్పడానికే ఇవాళ నే నిక్కడికి వచ్చాను.

రమే—అయితే నీ రాక వ్యర్థమే రమా! నీ మేలుకోసమే చెప్తున్నావేమో ననుకున్నాను. అలా కానప్పుడు నన్ను హెచ్చరించి ప్రయోజనం మేమీ కన్పించటం లేదు.

రమ—బావా, ప్రపంచంలో అన్ని ప్రయోజనాలూ కంటికి కనపడుతాయా?

రమే—కన్పడనిదాన్ని నేను అంగీకరించను రమా. నేను వెళ్తున్నాను. [నిష్క్రమణ]

రమ—[అకస్మాత్తుగా ఏడ్పుపొంగిరాగా] గుడ్డివారికి నే నెలా చూపగలను?

—o—

# చతుర్థాంకము

## మొదటి దృశ్యం

[రమ యింట్లో వరండాలో ఒకప్రక్కన పూజామందిరం. దుర్గప్రతిమ స్పష్టంగా కన్పించదుగాని పూజాసామగ్రి యెదుట వుంటుంది. పగలు మూడోజాము. పూజ పూర్తిఅయింది. ఒకప్రక్కన రమ కదలకుండా కూర్చుని వుంటుంది. అంతలో గుమాస్తా వస్తాడు]

గుమాస్తా—అమ్మాయి! వేళ మిగిలిపోతున్నా పురోహితు లెవరూ రాలేదు, నేను అలా పోయి చూచిరానా?

రమ—ఎవరూ రాలేదా?

గుమా—లేదు. [నిష్క్రమణ]

[హాంక్కో పట్టుకుని వేణి ప్రవేశం]

వేణి—హిష్! ఈ అలగాజాతి జనం ఇన్నినంటకాలను వృధా చెయ్యాలనుకుంటారా! ఎంత ధీమా వీళ్ళకు! నే నీ వెధవలకు బుద్ధిచెప్తాను—తప్పకుండా వీళ్ళకు బుద్ధి చెప్తాను. వీళ్ళ యిళ్లూ వాకిళ్లూ యెగరగొట్టించక పోతే, నేను—

[వేణివంక చూచి రమ నవ్వుతుంది]

వేణి—కాదు, ఇది నవ్వులాటకాదు, రమా. సర్వనాశనం విషయం. దీనికి మూలమెవరో ఒకసారి నాకు తెలిస్తే నేను వాని నిట్టే పీకిపారేస్తాను. వీళ్ళెవరిని ఆధారంగాచూచుకొని ఇలా గంతులేస్తున్నారో ఆ రమేశ్ యిప్పుడు జైల్లో గానుగ లాగుతున్నాడని ఈ వెధవ లెరుగరు. ఇంక వీళ్ళని నాశనంచేయడానికి యెంత

సేపు? భైరవాచార్యుని కొట్టేందుకు రమేశ్ అతని యింటిమీదికి వచ్చాడనీ, అప్పుడు వానిచేతిలో కర్ర వున్నదనీ స్పష్టంగా నిరూపించాను. అప్పుడే వెధవ కాదనగలిగాడు? నేను తలచుకుంటే రాత్రిని పగలు, పగలును రాత్రిగాను చేసి చూపిస్తాను! యింకా కొన్నాళ్ళు చూస్తాను. తర్వాత — శాస్త్రంలో చెప్పే వుంది — యథా ధర్మః తథా జయః. శూద్రుడు లయి వుండి బ్రాహ్మణుల ధర్మకార్యాల్లో ఈ ఆకతాయి తనమూ! సరే— [నిష్క్రమణ]

విశ్వేశ్వరి—[ప్రవేశించి] రమా!

రమ—ఏమిటి పెద్దత్తా?

విశ్వే—ఏమిటిలా మౌనంగా కూచున్నావ్? చూచినవాళ్లు ప్రతిమ అనుకునేటట్లున్నావేమిటమ్మా? [మెల్లగా దగ్గరకువచ్చి కూచుంటుంది] ఆ నవ్వూలేదు, ఉల్లాసమూ లేదు. మతి యెక్కడ లేనట్లుంది.

రమ—[నవ్వి] లోపల యింతసేపు ఏంచేస్తున్నావు పెద్దత్తా?

విశ్వే—నీ యింట్లో పనితక్కువా అమ్మాయి? భోజనపదార్థాలు గుట్టలువేయించితివామె.

రమ—కాని ఇవన్నీ వ్యర్థమే. రైతు లెవ్వరూ దేవీప్రసాదం తీసుకోవటానికి వచ్చేటట్లులేరు. కాని, క్రితం సంవత్సరాల్లోసంగతి నీకు తెలుసుగా పెద్దత్తా! ఈ సప్తమి నాడు జనాన్ని తప్పించుకొని ఇంట్లోకి రావడమే కష్టమయ్యేది.

విశ్వే—ఇంకా సమయం మించిపో లేదు రమా! సంధ్యానంతర మైనా రావచ్చు.

రమ—ఎవరూ రారు అత్తా!

విశ్వే—అందరూ యిామాటే అంటున్నారు. వేణీ, గంగూలీ కోపంతో పిచ్చెత్తినట్లు తిరుగుతున్నారు. లోపల మీా పెద్దమ్మతిట్లు వినలేకుండావున్నాము. నువ్వొక్క దానవే ఏమీా అనకుండా కూచున్నావు. కోపమూా లేదు; విచారమూా లేదు. నీ కళ్ళవంక చూస్తే మాత్రం వాటిలోపల ఏడుపు సముద్రం ఆగివున్నట్లు తోస్తుంది. అమ్మాయి, ఇలా మారిపోయావేమమ్మా?

రమ—పెద్దత్తా! నే నెవరిపై కోపగించుకోను? ప్రజలమీాదా? కేవలం పేదవారయినంతమాత్రానే వారికి మాన-మర్యాదలపట్టింపు వుండదా? వారు నావంటి పాపిష్టు రాలి అన్నంకోసం యెలావస్తారు?

విశ్వే—అమ్మాయ్. నిన్ను పాపిష్టురాలని ఎవరనగలరమ్మా?

రమ—అన్నా అనుచితమేమీా కాదు. మనకు వారంటే యిష్టంలేదనీ, వారికి మనమేమీా కామనీ వారికి తెలుసు. మనం వారి నేమైనా మర్యాదగా పిలిచామా? వచ్చి తినిపోండని ఆజ్ఞాపించాము. పైగా వారు రాకపోతే కోపంతో మండిపడుతున్నాము. వారికీ మర్యాద అంటే యేమిటో తెలిసింది, ప్రేమ అని దేన్నిఅంటారో రమేశ్ బావ వల్ల వారు గ్రహించారు. వారి ఆ ఆత్మబంధువు నే మోసపు కేసులో యిరికించి, తప్పుడు

సాక్ష్యాలు చెప్పి జైల్లో పెట్టించాము. మరి వారి ఈ దుఃఖాన్ని ఎలా మరపించగలం అత్తా?

విశ్వే—కాని నువ్వు తప్పుడుసాక్ష్యం చెప్పలేదుగా అమ్మాయ్?

రమ—నేను తప్పుడుసాక్ష్యం చెప్పలేదూ? ఎవ రబద్ధం చెప్పేనా. నేను అబద్ధమాడనని వారికి పూర్తిగా విశ్వాసంవుంది, కాని, చెప్పానే! ఆచార్యు డెంత అపరాధంచేస్తే, ఎంత కృతఘ్నుడైతే రమేశ్ బావకి తన్నుతా మరచే టంత కోపంవచ్చిందో నే నెరుగుదును. అదీగాక అప్పు డాయనచేతిలో గడ్డిపరకకూడా లేదని నాకు తెలుసు. అయినా కోర్టులో నిలబడి ఆయనచేతిలో కత్తి-కతారి వున్నదో లేదో జ్ఞాపకం తెచ్చుకోలేకపోయాను!

విశ్వే—రమా!

రమ—నేను అబద్ధం చెప్పలేదంటావు అంతేనా? ఆ కోర్టులో నా నోటితో అబద్ధంచెప్పనిమాట నిజమేకాని, ఆయన యెదుట సమాధానం యేం చెప్పను? ఓయి భగవంతుడా! సత్యాన్ని దాచివుంచినభారం ఇంత భరింపరానిదిగా వుంటుందని నాకు ముందే తెలుపకపోయావా!

విశ్వే—కాని రమా, అబ్బాయి అన్యాయంగా శిక్షింపబడినది నిజమేగాని, అంతమాత్రంతో వాని కేమీ అశుభం జరుగలేదు లే.

రమ—ఆయనకి అశుభం ఎందుకు జరుగుతుంది? ఆ పాపభారమంతా నా నెత్తినే వచ్చిపడిందిగా.

విశ్వే—అది ఒక్క నీ నెత్తినే పడలేదు రమా, మన మందరమూ పంచుకున్నాం. అత్యాచారాలకు ఆలవాల

మైన ఈ సమాజంలోని పిరికిపందలముఠా అపవాదు భయంచూపి నిన్ను కించపరిస్తే, ఆ పాపభారంచే వాళ్ళ తలలు దారిలోని దుమ్ములో కలిసిపోయాయి. నేను వేణీతల్లిని. రమా, నా తలకూడ యిప్పుడు దుమ్ము లోనే పొర్లాడుతున్నది. యింకెన్నటికీ నేను తలెత్తు కోలేను.

రమ—అలా అనమాకు పెద్దత్తా. నే నేంచేశానో యెరుగుదువా? ఒక నిర్జనమార్గంలో నేను ఒంటరిగాపోయి ఆయన్ను కలుసుకొని ఇక్కడవుండొద్దు, ఎక్కడికైనా వెళ్ళిపొమ్మని చెప్పాను. కాని ఆయన విశ్వసించక 'నే వెళ్తే నీ కేంలాభం' అని అడిగారు. నా లాభమా? నేను ఒక్కసారిగా వ్యధచెంది, పిచ్చిదాననయ్యాను. లాభమేమీ లేదుగాని, నాకు నష్టం చాలావున్నదని చెప్పాను. మా యింట్లో దుర్గాపూజకు, జితిన్ వడుగుకు ఎవరూ రారనీ, యిక్కడవుండి నన్ను నాశనం చేయొద్దనీ చెప్పాను. కాని యింత అబద్ధం యెలా వచ్చిందో నా నోటికి? ఈ మాత్రానికే అయితే తన పని వదలిపెట్టి వెళ్ళనని చెప్పేశారు. ఆయన యీ వుపేక్షతో కలతచెంది, పోసి శిక్షపడనీ అనుకున్నాను. అయితే ఏదో మామూలు జరిమానా వేస్తారనుకున్నానే గాని, ఈ విధంగా జైలుశిక్ష వేస్తారని, అనారోగ్యంగా వున్న ఆయన మొహంచూస్తే న్యాయాధికారికి జాలి కలుగదనిగాని నేను కలలోకూడ తలచలేదు పెద్దత్తా!

విశ్వే—అవును, నాకు తెలుసునమ్మా.

రమ—కోర్టులో ఆయన నా మొహంవంకే చూస్తూవుండిపో
యారని విన్నాను. ఆయనగుమాస్తా అప్పీలుచేద్దా
మంటే 'జీవితమంతా జైలులోనే గడపవలసివచ్చినా
అప్పీలుచేసి విడుదలపొందడం మంచిదికా'దని నిరాక
రించారట. పెద్దత్తా, యిది నాకెంత కఠినశిక్షో
నువ్వే చెప్పు?

విశ్వే—కాని, యిప్పుడు విడుదలకూడ దగ్గరకువచ్చిందిలే.

రమ—వారికి విడుదల అవుతుంది. కాని వారి ఆ ఘోర
అసహ్యదృష్టినుండి నాకీ జీవితంలోనే విముక్తిలేదు.

[వృద్ధసనాతనుని వెంటపెట్టుకొని వేణీ ప్రవేశం]

వేణీ—ఇతడు మూడుతరాలనుంచి మన రైతు. అటు వెళ్తూ
పిలిస్తేగాని లోపలికి రాలేదు. ఏంరా సనాతనా, ఇంత
అభిమానం ఎక్కణ్ణుంచి వచ్చిందిరా? నీ మెడమీద
క్రొత్తతల మొలిచిందా యేం?

సనా—రెండుతలలు ఎవరిమెడమీదమాత్రం యెలా వుంటై
బాబూ? తమవంటివారికే లేనప్పుడు మాబోటి పేద
వాళ్ళకి ఎలా వుంటై?

వేణీ—ఏమన్నావురా లుచ్ఛా వెధవా?

సనా—పెదబాబూ, రెండుతలలు యెవరికీ వుండవు—యీ
సంగతేగా చెప్పాను, ఇంకేమీ అన్లేదే.

[గోవిందగంగూలీ ప్రవేశం]

గోవిం—మీకీ ధైర్యం ఎక్కణ్ణుంచివచ్చిందా అనే చూస్తు
న్నాము. దేవీప్రసాదం పుచ్చుకోవటానికూడా మీ
రెవరూ రానేలేదే !

సనా—[నవ్వి]మాకు ధైర్యమేమిటండీ!మమ్మల్నేం చెయ్యాలో అది తమరు చెయ్యనేచేశారు. అది పోనీండి. కాని అది దేవీ ప్రసాదమే కానివ్వండి, ఇంకేమైనా కానివ్వండి, ఇంక మా పల్లెజాతివా రెవరూ మీ బ్రాహ్మల యిళ్లల్లో తినరు. భూదేవి యింత మహాపాతకాన్ని ఎలా భరిస్తున్నదా అనే మేము చర్చించుకుంటున్నాము. [విచారంతో నిట్టూర్చి, రమవైపు చూస్తూ] అమ్మా, కొంచెం జాగ్రత్తగా వుండాలి. పీర్‌పురం యువకదళం బొత్తుగా పిచ్చెత్తినట్టుంది. ఈ మధ్య పెదబాబు యింటిచుట్టూ మూడునాల్గుసార్లు ప్రదక్షిణం కూడా చేశారు. అయితే పెదబాబు వారికి చిక్కక పోవడమే మేలైంది! [వేణీవైపు చూచి] పెదబాబూ, మీరు కాస్త మెలకువగా వుండండి. రాత్రుళ్ళు, కానివేళల్లోను బయట తిరక్కండి.

[వేణీ ఏమో అనాలనుకుంటాడు గాని, భయంవల్ల అతనికోట మాటరాదు.]

రమ—[వాత్సల్యపూర్వక స్వరంతో] సనాతనా, చినబాబు గారినిగురించేకదూ మీ యీ కోపమంతా ?

సనా—నేను అబద్ధమాడి నరకానికి పోనమ్మా! అసలు విషయం అదే. అందులోనూ పీర్‌పురంవారి కోపానికి అంతులేదు. వారు చినబాబుని దేవతగా యెంచుకుంటున్నారు.

రమ—[ఆనందోజ్జ్వలముఖియై] అలాగా సనాతన్?

వేణీ—[సనాతనునిచేయి పట్టుకొని] ఇదే,నువు ఇన్స్పెక్టరుగారి దగ్గరకువచ్చి చెప్పాలి. నువు కోరినది యిస్తాను. నీ ఆ

రెండెకరాలకొండ్ర కోరుకున్నా వదిలేస్తాను—నేను దేవునిముందు ప్రమాణంచేసి చెప్తున్నా, నమ్ము-
నువ్వీ బ్రాహ్మణుని మాట విను.

సనా—ఇప్పుడా రోజులుకావు పెదబాబూ! కాలం మారిపోయింది చినబాబు అంతా తాగ్మారు చేసివేశారు.

గోవిం—అయితే బ్రాహ్మణునిమాట వినవన్నమాట?

సనా—[తల అడ్డంగా త్రిప్పి] ఊఁహూఁ, చెపితే మీకు కోపం వస్తుంది; కాని ఒకనాడు పీఠ్‌పురం స్కూల్లో 'మెడలో రెండుపోగులు జందెమున్నంత మాత్రాన ఎవరూ బ్రాహ్మడై పోడు' అని చినబాబు చెప్పారు. మరి బాబూ, నేనూ యీనాటివాడిని కాదుగదా, అంతా నాకూ తెలుసు. మీరుచేస్తున్న పనులన్నీ బ్రాహ్మలపనులేనా? అమ్మా, నిన్నే అడుగుతున్నాను, నువ్వే చెప్పు?

[రమ మెదలకుండా తల ఒంచుకుంటుంది.]

సనా—[కోపం అణచుకొని] ఇప్పుడంతా యువకులదేనండీ. ఈ రెండూళ్ళ కుర్రవాళ్ళూ రోజూ చీకటిపడిన తర్వాత సంఘంయిల్లు వుందే, దాన్లో చేరుకుంటారు. వాళ్ళు జమీందారంటే చినబాబు ఒక్కరే, మిగతా వారందరూ దొంగలు, దోపిడీగాళ్ళూ నంటారు. భూమి పన్ను యిస్తామేగాని, ఒకరికి భయపడాల్సిన అవసరం ఏమున్నదంటారు. ఎవరైనా సరే బ్రాహ్మల్లావుంటేనే బ్రాహ్మలు, లేకపోతే మనమెంతో వారూ అంతేనని అంటున్నారు.

వేణీ—సనాతనా! ఇంతకూ జనం నామీదనే అంతకోపంగా వుండటానికి కారణ మేమిటంటావు?

సనా—కారణం లేకేం పెదబాబూ? ఈఅనర్థాలకన్నిటికీ మీరే మూలమని అందరూ తెలుసుకున్నారు.

[వేణీ భయంచే మిన్నకుండిపోతాడు. ఆయనగుండె కొట్టుకుంటూంది]

విశ్వే—గంగూలీగారూ, ఒక సామాన్యుడినోట ఇలాంటి మాటలు వస్తూంటే విని కూడ వూరుకున్నారేం?

[వేణీబాబు కోపంచే వక్రదృష్టితో చూస్తూ మౌనంగావుంటాడు]

గోవిం—ఆం, ఏంరా సనాతనా, అందరూ ఆ సంఘంఇంట్లోనే చేరుతారుకదూ? అక్కడచేరి ఏం చేస్తుంటారో నీకు తెలుసా?

సనా—ఏం చేస్తుంటారో నాకు తెలియదుగాని, బ్రతకదలిస్తే యింకే చెడ్డపనీ తలపెట్టకండి మహారాజా! వాళ్ళు చిన్నా-పెద్దా అంతా అన్నదమ్ముల్లా వుంటున్నారు. అందరికీ ఒకే ప్రాణం, ఒకే మనసు. చినబాబుని అన్యాయంగా జెల్లో వేయించారన్న కోపంతో తుపాకిమందులా వున్నారు. మీరువాళ్ల మధ్యకుపోయి, కొంటెపెత్తులు వేశారో, భగ్గుమని భస్మంచేసేస్తారు. నేను చెప్తున్నానుగా— మిమ్మల్ని జాగ్రత్తగా వుండమని. ఇక మీయిష్టం, నే వెడుతున్నాను.

[నిష్క్రమణ]

[సనాతనుడు వెళ్ళినతర్వాత కాస్సేపు అందరూ మౌనంగావుంటారు]

వేణీ—రమా, విన్నావుకదూ సంగతియావత్తూ?

[రమ చిర్నవ్వు నవుతుంది. జవా బివ్వదు. ఆమె నవ్వుచూచి వేణీకి ఒళ్లుమండినట్లుంది.]

వేణీ—ఆ వెధవ భైరవుడినిగురించే ఇంత తంటా వచ్చిపడింది. రమా, నువ్వక్కడికి రాకపోతే, వాడిని విడిపించకపోతే యిదంతా జరిగేదే కాదు. ఆ వెధవే దెబ్బలు తినే వాడు, నీ దేం పోయింది?

[రమ మళ్ళీ నవ్వుతుందేగాని మాట్లాడదు]

వేణీ—రమా, నీకు నవ్వుగానే వుంటుందిలే. నువ్వు ఆడు దానివి; నీకు ఇంట్లోంచి బయటికిరావలసిన అవసర ముండదు. కాని మే మేంచెయ్యాలో చెప్పు? ఎప్పు డైనా పీలుచూచుకొని వాళ్ళు మా బుర్రలు పగుల గొట్టితే ఏంకావాలి? ఆడవాళ్లతో కలిసి పనిచేస్తే యిలాగతే పట్టుతుంది.

[రమ నిస్తుపోయి అతనిమొహంవంక చూస్తుంటుంది]

వేణీ—గంగూలీగారూ, ఇక్కడే కూర్చుంటే యెలా? శాస్త్ మా దర్వాన్‌నూ, నౌకరునూ పిలవండి. రెండు లాంతర్లుకూడా తెమ్మనండి.

గోవిం—రా, బయటికివెళ్ళి పిలిపిస్తాను. నీ కెందు కింత భయం? కాకపోతే నేనే మీ ఇంటిదాకాపంపి వెళ్తాను.

[ఇద్దరూ నిష్క్రమణ]

## రెండో దృశ్యం

[ఒక మార్గం. జగన్నాథ, నరోత్తముల ప్రవేశం. జగన్నాధునిచేతిలో కర్రవుంటుంది]

నరో—ఆఁ, యిదే దారి. ఇటునుంచే వెడతాడు. జగ్గూ, యిప్పుడు చెప్పు, ధైర్యంగా చేసేస్తావుగదూ?

జగ—బలే, ధైర్యం లేకేఁ! శిక్ష అనుభవించటానికి

సిద్ధమయ్యో, శిక్షించటానికి బయల్దేరాను. ఎంత దుఃఖ పెట్టాడు! దుర్గతల్లీ! ఇవాళ నా చేతులు వణక్కుండా ఒక సత్కార్యంచేసేటట్లు దీవించుతల్లీ!

నరో—ఏఁరా, చేతులు వణుకుతాయా?

జగ—వణకవచ్చు. తాతలనాటినుంచీ దెబ్బలుపడటానికే అలవాటుపడ్డాముకదూ! అంచేత చివరికూడా నా చేతులు పైకి లేవకపోతే అది నా చేతులదోషమేకాని నాది కాదని తెలుసుకో.

నరో—సరే, అయితే లాఠీ నా చేతికిచ్చి నువ్వు దూరంగా నిలబడు. నే నేంచేయగలనో చూపిస్తాను.

జగ—నరోత్తమా! వద్దు వద్దు; నువ్వు పిల్లలుగలవాడివి. నా కెవరూ లేరు—ఇదే అవకాశం. చినబాబు బయటికి వస్తే యింక యీపని జరుగదు. ఆయన ఆపేస్తారు కాబట్టి ఆయన జైల్లోనుంచి విడుదలకాకముందే బదులు తీర్చి నేను జైలుకుపోతాను. ఇక నువ్వు ఇంటికివెళ్లు.

[నరోత్తముడు కొంతదూరంగా పోయి నుంచుంటాడు. రెండోవైపు నుంచి వేణీ, గోవిందుడు, దర్వానుల ప్రవేశం. దర్వానుచేతిలో లాంతరు వుంటుంది.]

వేణీ—[ఉలిక్కిపడి, భయంగానే] ఎవర్రా అక్కడ నిలబడింది?

జగ—నేను, జగన్నాథుణ్ని.

గోవిం—దారిలో నిలబడి ప్రసాదంపుచ్చుకోవటానికెవర్నీ రాకుండా అడ్డుతగుల్తాన్నావా? ఏఁరా లుచ్చా!

జగ—గంగూలీగారూ, ముందేచెప్తున్నాను—తిట్టకండి.

వేణీ—తిట్టకూడదూ? లుచ్ఛా వెధవా! రేపే నీ కొంపా - గోడూ పీకిపారేస్తాను తెలుసా?

జగ—ఆ, తెలుసు, యింతవరకు చాలాకొంపలు కూల్చావు. కాని ఇంకెవరికొంపా కూల్చలేకుండా చేసిపోతాన్లే ని స్సందేహం.

వేణీ—ఆ! ఏం చేస్తావురా వెధవా? [ముందుకు వెళ్తాడు]

జగ—ఇదిగో; యిదే ! [అని వేణీతలమీద కర్రతో మోదుతాడు]

వేణీ—అయ్యో! చచ్చాను!

[గోవిందుడు, దర్వాను అరుస్తూ పారిపోతారు]

వేణీ—జగన్నాథ్! నీకాళ్ళు పట్టుకుంటాను, బ్రాహ్మణ్ణి చంపమాకు. ఒట్టేసి చెప్తున్నాను—నీకు పదెకరాలు యిస్తాను—నన్ను చంపమాకు.

జగ—నాకు నీ పొలమేమీ వద్దులే, నువ్వే వుంచుకో. కాని నేను బ్రాహ్మణహత్య చెయ్యనులే.

వేణీ—జగన్నాథ్! ఇవాళ్టినుంచి మనం తండ్రీ కొడుకులంరా బాబూ; నువు కోరుకున్నది...

జగ—నా కేమీ అక్కర్లేదులే. ఇంకేదో అన్నావే, నీతో నా తండ్రీ కొడుకుల సంబంధం? రామరామ! పెదబాబూ, ఇదే ఆఖరుదెబ్బ కాదని చెప్పిపోతున్నా. మా యజమానివని, బ్రాహ్మణుడవని మేము సహించినకొద్దీ నీ దుండగాలు మితిమీరినయి. ఇంక మేము సహిం

చం—తెలిసిందా? ఇకనైనా మీరు తిన్నగావుంటారో లేదో చూస్తాం—జాగ్రత్త!

[నిష్క్రమణ]

వేణీ—అయ్యోబాబో! చచ్చాను! ఈ దొంగవెధవలు పారిపోయారే!

[గోవిందుడు, దర్వాన్ ప్రవేశం]

గోవిం—[వణకుతూ] పారిపోతావేమో బాబూ. పారిపోలేదు. మనుష్యుల్ని పిల్వటానికి వెళ్ళాను. ఎంతపనిజరిగింది! జగ్గూగాడు ఎటువంటి గూండాయో తెలిసిందిగదూ! వెధవమీద దోపిడీకేసు బనాయించి ఐదేండ్లు శిక్ష వేయించకపోతే నాపేరు గోవిందగంగూలీయేకాదు!

దర్వాన్—[వణుకుతూ] చేతిలో క ర్ర లే క పో యిం ది! ఉంటేనా...

వేణీ—ఛీ దొంగవెధవల్లారా! నా యెదుటనుంచి దూరంగా పోండి! ఈడ్చిపెట్టాడు నెత్తిమీద. [తలమీద చేతులు పెట్టుకొని] ఒరి దేవుడా! ఎంత నెత్తురు కారిపోతోంది! ఇక నేను బ్రతకను [అని ఒరిగిపోతాడు]

గోవిం—[వేణీని పట్టుకొని లేవదీయబోతూ] ఏం పర్వాలేదు బాబూ, ప్రాణమోసం లేదులే! నేను నిన్ను కలకత్తా ఆస్పత్రికి తీసుకెళతాగా. [దర్వాన్‌తో] అరె, పట్టుకోవేంరా వెధవా!—వెధవ, భయపడి నక్కలా పరుగెత్తాడు.

దర్వా—ఏంచేస్తాంబాబూ? చేతిలో కర్రయినా లేకపోయె—

[ఇద్దరూ వేణీని లేవదీసుకొని వెళ్తారు]

మూ డో దృ శ్యం

[రమ పడకగది. రమ జబ్బుతో మంచంమీద పడుకొనివున్నది. ఎదురుగావున్న కిటికీగుండా ప్రొద్దుపొడుపు ఎండ లోపలికివచ్చి నేలమీద పడుతూంటుంది. విశ్వేశ్వరి ప్రవేశం]

విశ్వే—[గద్గదకంఠంతో] ఏఁ అమ్మాయ్, రమా! యివాళ యెలావుంది?

రమ—[చిర్నవ్వుతో] బాగానేవున్నాను పెద్దత్తా!

విశ్వే—రాత్రి జ్వరం తగ్గిందా?

రమ—లేదు. కాని ఎప్పుడో తగ్గిపోతుందిలే.

విశ్వే—దగ్గు?

రమ—దగ్గు ఇంకా అలాగే వస్తోంది.

విశ్వే—మరి బాగేమిటమ్మా?

[రమ నవ్వుతుంది. విశ్వేశ్వరి ఆమెతలవేపుకు వెళ్ళి కూర్చుంటుంది. రమ తలమీద చేత్తో నిమురుతూంటుంది]

విశ్వే—అమ్మాయ్! నీ నవ్వుచూస్తే, చెట్టునుంచికోసిన పువ్వు దేవతపాదాలవద్ద పడివుండి నవ్వుతూన్నట్టుంది రమా!

రమ—ఎందుకని పెద్దత్తా?

విశ్వే—నేను నీకు తల్లివంటిదాన్ని రమా—

రమ—'తల్లివంటి' ఏమిటి అత్తా? నువ్వు నాకు తల్లివే.

విశ్వే—[వంగి రమ నుదురుపై ముద్దుపెట్టుకొని] అయితే, అమ్మాయ్! నిజం చెప్పు—ఏమిటయింది నీకు?

రమ—జబ్బుపడ్డాను, ఇంకేమిటవుతుంది?

విశ్వే—అది నా యీ కళ్ళతో చూస్తూనేవున్నాగా. ఈ కళ్ళకు కన్పించనిదేదైనా వుంటే, నీ తల్లిముందు దాచకమ్మా! అలా దాచితే జబ్బు నయంకాదు.

రమ—[కాస్సేపు కిటికీగుండా బయటకు చూచి] పెదబావకి యెలావుంది అత్తా?

విశ్వే—తలమీదిదెబ్బమూనటానికి ఆలస్యమవుతుంది. కాని, నాలుగైదురోజుల్లోనే ఆస్పత్రినుంచి వచ్చేస్తాడు. నువ్వేమీ విచారపడొద్దు రమా! వాడికి అలా జరగటం అవసరమే. దీనితో బాగుపడతాడు. తల్లినైయుండి కన్నబిడ్డకు యింత ప్రమాదంజరిగితేకూడ ఇలా అంటున్నదేమా అనుకుంటున్నావుకదూ? కాని, ఇందువల్ల నాకు దుఃఖమెక్కువకలిగిందో, ఆనందమే అధికమో చెప్పలేనమ్మా, అధర్మానికి వెరువనివారికి, సిగ్గులేనివారికి ఈమాత్రం భయమైనాలేకపోతే ఈ ప్రపంచమే మసైపోతుంది రమా. కాబట్టి, అమ్మాయ్!—ఆ రైతుబిడ్డ జగన్నాథుడు వేణీకి చేసినంతమేలు యింకే ఆత్మబంధువూ చెయ్యలేడనిపిస్తోంది నాకు. కడిగితే బొగ్గు నలుపు పోదమ్మా, దాన్ని మంటలో కాల్చవలసిందే.

రమ—కాని, పూర్వం అలాకాదు పెద్దత్తా. యిక్కడి రైతుల్ని యిలా తయారుచేసిన దెవరో?

విశ్వే—వీళ్ళ నింత సాహసానికి పురికొల్పిన దెవరో నీకు తెలియదా రమా? ఏదో ఒకవిధంగా జైల్లో పెట్టించితే చిక్కులేకుండాపోతుందనుకున్నారు. కాని, ఒకసారి నిప్పంటుకుంటే మళ్ళీ తేలిగ్గా ఆరదని ఆలోచించలేదు. జబర్దస్తీగా ఆర్పివేయబోతే దగ్గరకు వచ్చినవారిని కూడా కాల్చివేస్తుంది.

రమ—కాని యిది మంచిదా పెద్దత్తా?

విశ్వే—మంచిదే. ప్రబల అత్యాచారాలు చేయాలనే వీరి తీవ్రాభిలాష ఒకవైపున, నిరుపాయులైన ప్రజల సహనమనే అవిచ్ఛిన్న పిరికితనం రెండోప్రక్కన—ఈ రెండింటినీ కూడా అది తుదముట్టిస్తే మంచిదే. అమ్మాయి! వేణీకి పట్టిన గతికి నే నేమీ విచారించను. పైగా నా రమేశ్ తిరిగివచ్చి, చిరంజీవియై, యిలాగే ప్రజాసేవ చేయగలగాలని ప్రార్థించుతాను. ఏకైక సంతానమంటే ఏమిటో తల్లికే తెలుస్తుంది రమా! రక్తం కాలువగడుతూన్న గాయంతో వేణీని మేనాలో ఆస్పత్రికి తీసుకెడుతూంటే అప్పుడు నా మనస్సు యెలా వున్నదో నేను చెప్పలేనమ్మా! అయినా నే నెవరికీ శాపనార్థాలు పెట్టలేదు. ధర్మదండం తల్లి మొహం చూచి ఊరుకోదని నేను మరచిపోలేను రమా!

రమ—అత్తా, నేను నీతో వాదించలేనుగాని, యిదే నిజమైతే మరి రమేశ్ బావ ఏ పాపానికి ఇన్నికష్టాలు అనుభవిస్తున్నారు? మే మెన్ని తప్పుడుపనులు చేసి ఆయన్ని జైలుకు పంపామో—ఎవరికీ తెలియనివి కావే!

విశ్వే—అందరికీ తెలుసు కాబట్టే వేణీ యివాళ ఆస్పత్రిలో వున్నాడు. మరి నీ పనికూడా—అమ్మాయ్—ఏదీ నిష్ఫలమై శూన్యంలో కలిసిపోదని తెలుసుకో. దాని శక్తి ఎక్కడో ఒకచోట తనపని చేస్తూనేవుంటుంది. కాని, ఎలా పనిచేస్తున్నదీ అందరికీ అన్నివేళలా తెలియదు. ఇందువల్లే ఇంతవరకు యీ సమస్య—ఒకరి పాపానికి మరొకరు ఎందుకు ప్రాయశ్చిత్తం చేసుకో

వాల్సి వస్తున్నదో— తేలలేదు. కాని, ప్రాయశ్చిత్తం తప్పనిసరేనమ్మాః.

[రమ మెదలకుండా నిట్టూర్పుతుంది]

విశ్వే—అమ్మాయ్, ఈ ఘటనవల్ల నేనూ కళ్లు తెరిచాను. ఒకరికి మేలు చేద్దామనుకోవటంవల్ల నే మేలు చేయచేయలేము. ఆదిలో చిన్న పెద్ద మెట్లు అనేకం ఎక్కేందుకు ధైర్యం వుండాలి. ఒకసారి రమేశ్ హఠాత్తుగా ఇక్కడినుంచి వెళ్ళిపోవాలనుకున్నాడు. అప్పుడు నేనే వానిని పోనివ్వలేదు. అందువల్ల, రమేశ్ జైలుకు వెళ్ళినప్పుడు నేనే వానిని జైలుకు పంపాననిపించింది. ఎక్కడినుంచో వచ్చి మంచి చేయటంలో యింత విదలింపు, అవమానం వున్నదని నాకప్పుడు తెలియదు. మంచి చేయటం చాలా కష్టం రమా!

రమ—కష్టం ఎందుకని పెద్దత్తా?

విశ్వే—పదిమందితో కలసి ఒకటి అవ్వాలని అప్పుడు తోచలేదు. రమేశ్ ముందే చాలా తీవ్రమైన అధికజీవనశక్తితో వచ్చి, చాలాఎత్తున నిలబడ్డాడు. అంచేత ఎవరూ వానిని అందుకోలేకపోయారు. కాని తర్వాత దేవుడు వానిని క్రిందికిదించి మేలేచేశాడు!

రమ—భగవంతుడు కాదు అత్తా! మనమే. కాని, మన అధర్మం ఆయు నెందుకు క్రిందికి దించాలి?

విశ్వే—ఎందుకు దించదు అమ్మాయ్? మరి పాపం యింత భయంకరమైన దెందుకని? ఉపకారానికి ప్రత్యుపకారం చేయక, పైగా అపకారమే చేయబోతే, అట్టివానివల్ల

ఏమవుతుంది?—మనిషి కృతఘ్నతే దాతను క్రిందికి లాక్కురాకపోతే? రమా, నీ వూరు రమేశ్ నిప్పుకూ వెనుకటిలాగే పొందుతుందా? అత డేచేతుల్తో యింత వరకు పదిమందికీ మేలుచేశాడో, ఆ చేతులనే భైరవాచార్యులు—ఒక్క భైరవాచార్యులే అన్నమాటేమిటి మీ రందరూ మెలిత్రిప్పి విరిచేశారని మీకే తెలుస్తుంది. అదీ మంచిపనికాదని ఎవరంటారు? అతని బలిష్ఠమైన చేతులనిండా ఇచ్చే దానాన్ని స్వీకరించేశక్తి జనానికి లేనప్పుడు, మరి వాని ఆ కుంటిచేతులే ప్రజలకు వుపయోగించుతాయి.

[విశ్వేశ్వరి విచారంగా నిట్టూర్పుతుంది. రమ కొంచెంసేపటివరకు ఆమె చేయిపట్టుకొని అటూయిటూ వూగించుతూ వుండీ, తానుకూడ నిట్టూర్పుతుంది.]

రమ—పెద్దత్తా!

విశ్వే—ఏం అమ్మాయ్?

రమ—తిరస్కారం, అపకీర్తి-న న్నింక తాకలేవు పెద్దత్తా! నేను తప్పుడుసాక్ష్యం చెప్పి ఆయన్ను జైలుకు పంపిన నాటినుంచి ప్రపంచంలోవున్న దుఃఖమంతా నాకు పరిహాసాస్పదంగా అయిపోయింది.

విశ్వే—అలాగే జరుగుతుంది రమా!

రమ—ఏ విధంగానైనాగానీ శత్రువును కూలద్రోయుటలో దోషంలేదని అందరూ చెప్పారు. వారు అలాగే చేశారుకూడాను. కాని నే నలా అనలేను పెద్దత్తా!

విశ్వే—ఎందుకని?

రమ—నావల్ల కాదు అత్తా! నీముందు మరో సంగతి చెప్పేస్తున్నాను, సంఘంయింట్లో కుట్రకారులంతా సమావేశమవుతూ, రమేశ్ బావ చెప్పిన ప్రకారమే ముఖ్య విషయాలు ఆలోచించుకుంటూంటారు. వాళ్ళందరూ తుంటరులని రిపోర్టిచ్చి పోలీసులకు అప్పగించడానికి కుట్ర జరుగుతోంది. నే నా కుట్రవాళ్ళకు కబురంపి ముందే హెచ్చరించాను. ఎందువల్లనంటే పోలీసుల కదే కావాలి. మరి ఒకసారి వారి చేతుల్లో పడితే ఇంక ముక్తి లేదు.

విశ్వే—[కంపించి] ఏం చెప్పావు రమా! వేణే తనప్రాణ్యోక్తి పోలీసులను తప్పుడు రిపోర్టిచ్చి పిలిపించి మళ్ళీ కల్లోలం తెచ్చిపెట్టాలనుకుంటున్నాడా?

రమ—యిది పెదబావకు వారు వేసిన శిక్షాఫలితమే ననుకుంటాను. పెద్దత్తా! నువ్వు నన్ను క్షమించుతావా?

విశ్వే—తల్లి నయివుండికూడ క్షమించలేకపోతే మరెవరు క్షమిస్తారు? భగవంతుడు నీకు అందుకుతగిన బహుమతి ప్రసాదించాలని ఆశీర్వదించుతున్నాను రమా.

రమ—[చేత్తో కన్నీరు తుడుచుకొని] విడుదలై వచ్చేప్పటికి వారి ఆనందక్షేత్రం తయారయివుండడం చూస్తారనేదే నాకు ఓదార్పుగావుంది. ఆయన కోరినది నెరవేరింది. వారి పీడితజనం కళ్ళుతెరచి లేచారు. ఆయన్ను గుర్తించారు; ప్రేమిస్తున్నారు. ఈ ప్రేమానందంలో నా అపరాధం మర్చిపోలేరూ ఆయన? పెద్దత్తా! ఒకచోట

మాత్రం మే మిద్దరం మారంకాలేకపోయాము—నిన్ను యిద్దరమూ ప్రేమిస్తున్నాము.

[విశ్వేశ్వరి ఆమె చుబుకము పట్టుకొని ముద్దుపెట్టుకొంటుంది]

రమ—ఆ బలంతోనే ని న్నొకటి కోరుతున్నాను అత్తా! నా అనంతరంకూడా ఆయన నన్ను క్షమించలేకపోతే, ఆయనతో నువ్వు నాతరఫున నేను ఆయన తలచినంత చెడ్డదాన్ని కాదనీ ఆయ న్నెంత బాధపెట్టానో, అంతకు మించి నేనూ దుఃఖించాననీ చెప్పు. నీ మాటల్ని ఆయన నమ్మకుండా వుండలేరు.

విశ్వే—అయితే, పద, మన మిద్దరం ఏ పుణ్యక్షేత్రానికో పోయి వుందాం. రమేశ్ గాని, వేణీగాని లేనిచోట—కళ్ళెత్తి చూస్తే దేవాలయశిఖరం కన్పడే చోటుకు పోయి వుందాం. రమా, నే నన్ని గ్రహించాను. నువ్వు వెళ్ళిపోయేరోజే వస్తే—అమ్మాయి—నే నీ విషాన్ని హృదయంలో వుంచుకొనే తీసుకెళ్ళను. ఏం అమ్మాయ్, నువ్విది చేయగలవా?

రమ—[విశ్వేశ్వరి మోకాళ్ళమధ్య మొహం దాచుకొని, ఏడుస్తూ] నావల్లకాదు పెద్దత్తా! న న్నెక్కడికైనా తీసుకెళ్ళు. [తెర]

## నాలుగో దృశ్యం

[జైలుముందరి రోడ్డు. ఒకవేపునుంచి రమేశ్, రెండోవైపునుంచి వేణీ ప్రవేశం. వేణీ తలకు కట్టుకట్టివుంటుంది. వెంట వనమాలిమాష్టరు, కొందరు విద్యార్థులు వుంటారు. మరికొందరు వేణీ మనుష్యులుకూడ వస్తారు]

వేణీ.—[రమేశ్ ని కౌగలించుకొని] తమ్ముడూ, రక్తస్పర్శలో

ఎంత ఆకర్షణ వుంటుందో ఇప్పుడు తెలిసింది. ఆ వెధవ బైరవుని గుప్పిట్లో పెట్టుకొని, రమఇలా శత్రుత్వం సాధిం చుతుందని, సిగ్గూ-బిడియం వదిలేసి, కోర్టులో ఇప్పుడు సాక్ష్యమిచ్చి యింత కష్టం తెచ్చిపెడుతుందని నేను ఎరిగివుండికూడా కళ్ళుమూసుకున్నాను. దేవుడు నాకు తగినశిక్షే విధించాడు. తమ్ముడూ, నువ్వు జైల్లో బాగానే వున్నావుగాని, నేను బయటవున్నా, గడ్డి మంటల్లో మండిపోతున్నా ననుకో!

[రమేష్ హతబుద్ధిలా నిలబడి చూస్తున్నాడు. ఏమనాలో అతనికి తోచలేదు. వనమాలి, విద్యార్థులు ముందుకువచ్చి రమేష్ పాదాలు స్పృశించుతారు.]

వేణీ—[కంటనీరుపెట్టి] తమ్ముడూ, నీ అన్నమీద కోపగిం చుకోవద్దు. పద, ఇంటికి వెళ్దాం. అమ్మ ఏడ్చిఏడ్చి కళ్ళు పోగొట్టుకునేస్థితిలో వుంది. రమేశ్, మే మెలాగో ప్రాణాలు నిల్పుకొని వున్నామనుకో.

రమే—[వేణీ తలమీదిపట్టీని చూపుతూ] ఇదేమిటి అన్నయ్యా! మీతల ఎలా పగిలింది?

వేణీ—వింటే ఏం ప్రయోజనం తమ్ముడూ! నే నెవర్నీ దూషిం చను. ఇది నా కర్మఫలితమే. నా పాపానికి శిక్ష. రమేశ్, లోపల ఒకటిపెట్టుకొని పైకి మరొకటిచెప్పటం నా జన్మలో యెరుగననీ నీకూ తెలుసు. సాధారణంగా లోపలవుద్దేశ్యాన్ని లోపలే దాచుకుంటారే—ఆ శక్తి నాకు లేదు. ఇందువల్ల ఎన్ని కష్టాలు అనుభవించినా నేను కళ్లు తెరవనేలేదు. నాదోషమల్లా ఆనాడు 'రమా,

నా తమ్ముడు నీ కేం అపకారం చేశాడని జైలుకు పంపావు? ఈ సంగతివిని అమ్మ ప్రాణం వదుల్తుంది; మా అన్నదమ్ములం ఆస్తి-పాస్తుల విషయంలో తగాదాపడినా, నువ్వు ఒక్క దెబ్బతో నాతమ్ముణ్ణి, తల్లిని కూడ కొట్టావే' అన్నాను ఏడుస్తూను. రమేశ్, ఆనాడు చూచిన రమ ఉగ్రరూపం తలుచుకుంటే యిప్పుడుకూడ నా గుండె అదరుతోంది సుమా. అప్పుడామె ఏమన్నదో తెలుసా? 'ఏం, వారినాన్న మా నాన్నగారిని జైలుకు పంపాలని ప్రయత్నించలా? సాగితే వదిలేవారా?' అన్నది.

రమే—అవును, రమ పెత్తల్లినోటకూడా ఈమాటే విన్నాను.

వేణే—ఇది ఆమె వంశవిరోధం. కాని ఒక ఆడుదాని అహంకారాన్ని నేను సహించలేకపోయాను. నాకూ కోపం వచ్చి 'సరే, రమేశ్‌ని జైలునుంచిరానీ, తర్వాత చూద్దాం' అన్నాను. కాని, తమ్ముడూ, ఖూనీచేయించటం అలవాటుగదూ. నీకు జ్ఞాపకం వుందిగా తమ్ముడూ, ఆ అక్బరుగాడిని నిన్ను చంపేందుకు పంపలా? కాని నీ ముందు ఆమెయెత్తు పారలేదనుకో. పైగా నువ్వు బాగానే బుద్ధిచెప్పావుగూడాను. కాని మనిష్ని కొట్టించడం ఏమంత కష్టం?

రమే—తర్వాత ఏమైంది?

వేణే—తర్వాత జరిగినదంతా నాకు జ్ఞాపకం వుంటుందా? నన్నెవరు ఆస్పత్రికి తీసుకెళ్ళారో, అక్కడేం జరిగిందో—నాకవేమీ తెలియవు. ఈ సారికి అమ్మ పుణ్యాన

అంటూ ఎలాగో బ్రతికాను. మన అమ్మవంటి అమ్మ ఇంకెవరికి వున్నది రమేశ్?

[రమేశ్ మనసులోను, మొహంలోను ఏమేమి జరుగుతున్నదో! కాని పైకిమాత్రం ఒక్కమాటా అనలేదు.]

వేణి—తమ్ముడూ, బండి సిద్ధంగావుంది. ఇంక ఆలస్యం చెయ్యొద్దు. ఇంటికి పద. నిన్ను తీసుకెళ్ళి అమ్మముందు నిలబెడితేగాని నాకు శాంతిలేదు.

రమే—పదండి, రమ జబ్బుగావున్నదని జైల్లో విన్నానే?

వేణి—రమేశ్, భగవంతుడు శిక్షించక వదుల్తాడా? ఇది దైవ రాజ్యమేనని అందరికీ జ్ఞాపకం వుంటుందా? పద తమ్ముడూ; ఇంటికి వెళ్దాం.

[అందరూ నిష్క్రమించుతారు]

## అయిదో దృశ్యం.

[రమ గదిలోకి రమేశ్ వస్తాడు. అతను రమను చూచి ఉలిక్కిపడతాడు.]

రమే—నువ్వింత సుస్తీగా వున్నావనుకోలేదే!

[రమ అతికష్టంమీద లేచి కూచుంటుంది. రమ అతనిపాదముల వైపు వంగి ప్రణామం చేస్తుంది.]

రమే—ఇప్పు డెలావుంది రాణీ?

రమ—మీరు నన్ను రమ అనే పిలవండి.

రమే—మంచిది. నీకు జబ్బుగావున్నదని విన్నాను. ఇప్పు డెలా వున్నదో తెలుసుకోవాలనే సంబోధించాను. లేకపోతే నీ పేరేదైనప్పటికీ ఆ పేరుతో పిలవాలనీ లేదు; సంబోధించవలసిన అవసరమూ లేదు.

రమ—ఇప్పుడు బాగానే వున్నాను. నేను మిమ్మల్ని పిలిపించి నందుకు మీకు ఆశ్చర్యం కల్గివుండవచ్చు. కాని—

రమే—లేదు, ఆశ్చర్యం కలగలేదు. నీ ఏపనికైనా ఆశ్చర్య పడే రోజులు వెళ్లిపోయాయి. కాని, న న్నెందుకు పిల్పించావనే అడుగుతున్నాను.

రమ—[కొంచెం సేపు తలవంచుకొని మౌనంగావుండి] రమేశ్ బావా! ఇవాళ రెండు పనుల నిమిత్తం మీకు శ్రమ ఇచ్చాను. నే నెన్ని అపరాధాలుచేసినా, మీరు నా యీ రెండుకోర్కెలను నిరాకరించరని నాకు దృఢ విశ్వాసం వుంది. [దుఃఖాతిరేకంచే కంఠం అవరుద్ధ మవుతుంది.]

రమే—ఏమి టా కోర్కెలు?

రమ—[చకితురాలైనట్లు తలెత్తిచూచి, మళ్లీ వంచుకుం టుంది] పెదబావ మీ సహాయంతో వశంచేసుకో గోరుతున్న పీర్‌పురం ఆస్తి నా స్వంతఆస్తి. నాన్న గారు నాకు దానిని ప్రత్యేకంగా యిచ్చిపోయారు. అందులో పదిహేనుఅణాలవాటా నాది; ఒక అణా వంతు మీది. ఆ నా ఆస్తిని నేను మీ కివ్వాలను కుంటున్నాను.

రమే—నువ్వేమీ భయపడనక్కరలేదు. అన్నయ్యా నాకెన్ని చెప్పినా నే నెన్నడూ ఎవరికీ మోసగించుటలో సహా యపడలేదు, ముందుకూడా సహాయంచేయను. ఇక నువ్వు దాన మివ్వాలనుకుంటే అందుకు చాలామంది వున్నారు. నాకు దాన-ధర్మాలు అఖ్ఖర్లేదు.

రమ—నాకు తెలుసు—రమేశ్ బావా!—మీ రలాంటి పనికి తోడ్పడరని నే నెరుగుదును. మీరు స్వీకరించినా మీ కోసం కాదనికూడా నాకు తెలుసు. కాని, అది కాదు; దోషంచేస్తే శిక్షలభించితీరుతుంది. నా అపరాధాలకు దండనరూపంగానే దీనిని ఎందుకు స్వీకరించకూడదు?

రమే—మరి నీ రెండో కోరిక?

రమ—నేను జితిన్ ని మీకు అప్పగించిపోతాను.

రమే—"అప్పగించి పోతాను!" అంటే?

రమ—[రమేశ్ మొహంలోకిచూచి] రమేశ్ బావా! ఒకనాటికి మీ కేదీ తెలియకుండా వుండదు. నేను జితిన్ ని మీకే అప్పగించిపోతాను. వానికి బాగా విద్యాబుద్ధులు చెప్పించి, మీలాగే స్వార్థత్యాగం చేయగలిగేటట్లు తయారుచెయ్యండి. [కొంగుతో కన్నీళ్లుతుడుచుకొని] ఇది నేను నాకళ్లతో చూడలేననుకోండి. కాని, జితిన్ ఒంట్లో వానిపూర్వుల రక్తమే ప్రవహించుతూన్నదని నా విశ్వాసం. వాని ఎముకల్లో కండల్లో మిళితమైవున్న త్యాగశక్తిని సరియైనమార్గంలో పెడితే, వాడూ ఒకనాటికి మీలాగే తలెత్తుకు తిరుగగల్గుతాడు.

[రమేశ్ మాట్లాడడు]

రమ—ఇలా మాట్లాడకుండా వూరుకుంటే నేను వదలిపెట్టను రమేశ్ బావా!

రమే—చూడు, ఈ గొడవలన్నిట్లోకి వన్నీ ద్వేకు. నే ననేక దుఃఖాలు సహించినతర్వాత కొద్దిపాటి జ్యోతిని ప్రజ్వ

లితం చేయగలిగాను. అందువల్ల అది ఎక్కడ ఆరి పోతుందోనని నా భయం.

రమ—కాదు రమేశ్ బావా! భయపడవలసిన అవసరంలేదు. ఆజ్యోతి యింక ఆరదు. మీరు దూరాన్నుంచి వచ్చి, చాలాఎత్తున కూర్చుని పనిచెయ్యా లనుకున్నారని పెద్దత్త చెప్పింది. అందువల్లే మీ కృషికి అన్నిఇబ్బం దులు ఎదుర్కొన్నాయి. అప్పుడు మీరు గ్రామసమా జంలో పరాయిమనిషిలా వున్నారు. కాని యిప్పుడు వారిలో ఒకరయ్యారు. అప్పుడు మీరుచేసిన దానం పరదేశిదానం. కాని ఇప్పు డది ఆత్మీయుని స్నేహ పూర్వక బహూకృతి. ఇప్పుడు మీరు దుఃఖమే పొంది, సహించేందుకు ఆ వెనుకటి మనిషికాదు. కాబట్టే ఇప్పు డీ జ్యోతి మందగించదు. పైగా దినదిన ప్రవర్ధ మానమైపోతుంది.

రమే—రమా, మనజ్యోతి ఇంక ఆరిపోదని నీ కెరుగుదు వా?

రమ—ఆ, నాకు బాగా తెలుసు. ఈ సంగతి సర్వం తెలిసిన పెద్దత్తే చెప్పింది. ఈపని మీరే చెయ్యాలి. నాజతిన్ ని మీ చేతుల్లోకి తీసుకోండి. నా తప్పులన్నీ క్షమించి, నేను నిశ్చింతగా వెళ్ళిపోగలిగేటట్లు ఆశీర్వదించండి.

రమే—రమా, నువ్వు వెళ్లిపోవటాన్ని గురించి ఆలోచించుతా వెందుకు? నీకు నయమవుతుంది.

రమ—రమేశ్ బావా! నాకు నయమవాలని ఆలోచించటం లేదు; వెళ్ళటాన్నిగురించే ఆలోచించుతున్నాను. మీరు

నాది మరో ప్రార్థనకూడ అంగీకరించాలి. నా గురించి మీరా రెన్నడూ పెదబావతో తగాదాపడవద్దు.

రమే— అంటే?

రమ—అంటే ఏమిటో ఎప్పటికైనా వినొచ్చు. కాని, నేను ప్రతిదీ పల్లెత్తి ఎదురుచెప్పకుండా సహించుతూ వచ్చానని మాత్రం జ్ఞాపకం వుంచుకోండి. నే నింక సహించలేక పోయినప్పుడు పెద్దత్త మిథ్యనుగూర్చిఆందోళనచేసి మేల్కొల్పితే దానిమనుగడఇంకాదీర్ఘమవుతుందనిచెప్పింది. సహించలేక దాని ఆయువును పెంచితే అంతకంటె పాపం ఏముంటుంది? ఆమె ఈ వుపదేశాన్ని స్మరించు కుంటూనే నేను సమస్తదుఃఖాలు, దౌర్భాగ్యం అనుభవించగలిగాను. మీరూ ఈ విషయం ఎన్నడూ మరచిపోవద్దు రమేశ్ బావా!

[రమేశ్ మౌనంగా ఆమె మొహంవంకే చూస్తుంటాడు]

రమ—రమేశ్ బావా, మీ రివాళ నన్ను క్షమించలేక పోయి నందుకు విచారపడకండి. ఇవాళ అతికఠినంగా తోచి నదే ఒకనాటికి అతిసహజమై, తేలికవుతుందని నాకు బాగా తెలుసు. ఆనాడు మీరు సహజంగానే నా అపరాధాలన్నీ క్షమించుతారు. ఈ విశ్వాసంవల్లనే నా మనసులో యిప్పు డెట్టి క్లేశ-దుఃఖాలు లేవు. నేను రేపు ఉదయాన్నే వెళ్ళిపోతున్నాను

రమే—రేపు వుదయమా! ఎక్కడికి వెళ్లేది?

రమ—పెద్దత్త ఎక్కడికి తీసుకెళ్తే అక్కడికే.

రమే—ఆమె ఇంక తిరిగిరాదని విన్నానే?

రమ—అవును, నేనూరాము. నే నివాళ మీా పాదసన్నిధినుంచి శాశ్వతంగా సెలవు తీసుకుంటున్నాను. [అని తల నేల కానించి, అతనికి పాదాభివందనం చేస్తుంది]

రమే—మంచిది, వెళ్లు. కాని, యిలా అకస్మాత్తుగా ఎందుకని వెళ్లిపోతున్నావో నేను తెలుసుకోవచ్చునా?

[రమ మాట్లాడదు]

రమే—నీ విషయాలన్నీ యీా విధంగా దాచిపెట్టి ఎందుకని వెళ్లిపోతున్నావో నీకే తెలియాలి. కాని నేనూ నిన్ను హృదయపూర్వకంగా క్షమించగలిగేటట్లు చేయమనే మనఃపూర్వకంగా భగవంతుని ప్రార్థించుతున్నాను. నిన్నిప్పుడే క్షమించలేకపోవుచున్నందుకు నాకెంత బాధగావున్నదో ఆ అంతర్యామికే తెలుసు.

[అకస్మాత్తుగా విశ్వేశ్వరి ప్రవేశం]

విశ్వే—రమా!

రమే—పెద్దమ్మా! నే నేమి అపరాధంచేశానని ఇలా మమ్మల్ని వదలిపెట్టి వెళ్ళిపోతున్నావమ్మా!

విశ్వే—అపరాధమా? బాబూ, అపరాధాల సంగతే చెప్పవలసివస్తే, దాని కెన్నడూ అంతేవుండదు. కాబట్టి ఆ ప్రసక్తేవద్దు. కాని, రమేశ్, నేను చెప్పేమాట అర్థంచేసుకోనాయినా! నే నిక్కడే చచ్చిపోతే వేణీయే నాతలకు కొరివి పెడతాడు; కాబట్టి నా కింక ముక్తి వుండదు. ఈ జీవితమంతా నిప్పులమీాదే గడిపాను. కాని, పరలోకంలోనైనా యిలా జరక్కుండా వుండాలనే ఇక్కడినుంచి పారిపోతున్నాను నాయనా!

రమే—పెద్దమ్మా! కొడుకు అపరాధాలు నిన్నింతగా వేధిస్తున్నాయని నాతో ఎన్నడూ అన్లేదే! మరి అన్నీ వదలిపెట్టి రమ ఎందుకని వెళ్ళిపోవా లనుకుంటున్నది? నువ్వామెను యెక్కడికి తీసుకెళ్తావు?

రమ—నే వెళ్తున్నాను పెద్దత్తా! [నిష్క్రమణ]

విశ్వే—రమ ఎందుకు వెళ్తోంది? నే నెక్కడికి తీసుకెళ్తున్నానంటావా? ఈ లోకంలో ఆమెకు స్థానం లభించలేదు రమేశ్! అందువల్ల ఆమెను దైవసన్నిధిలోకి తీసుకెడుతున్నాను. అక్కడికి తీసుకెళ్ళినా ఆమె జీవించుతుందో లేదో నేను చెప్పలేను. కాని బ్రతికితేమాత్రం శేషజీవితం యీ కఠినసమస్యా మీమాంసలో, అంటే—భగవంతు డామె కింత రూపం, ఉత్తమగుణాలు, యింత గొప్ప మహాప్రాణం యిచ్చి ఎందు కీ లోకంలోకి పంపాడో, మరి ఏదోషము, అపరాధము లేకుండానే ఆమెనెత్తిమీద ఇంత దుఃఖభారంమోపి ఎందుకి లోకంబయటికి విసిరేశాడో—ఇది భగవదేచ్ఛయో, లేక మన సామాజిక లీలా విలాసమో తెల్సుకొనుటలోనే వెళ్ళబుచ్చుమని చెపుతాను. రమేశ్! ఆమె వంటి దుఃఖితురా లింకెవరూ ఈ భూమిమీద వుండి వుండరు నాయనా!

[విశ్వేశ్వరి కంఠం రుద్ధమయింది. రమేశ్ మెదలకుండా ఆమెవంక చూస్తున్నాడు]

విశ్వే—కాని రమేశ్, నువ్వామెను తప్పుగా భావించవద్దనే నేను చెప్పేది. వెళ్తూవెళ్తూ నే నెవరిమీదా ఫిర్యాదు

చేయదలచుట లేదు. కాని, ఆమెకంటె నీమేలు కోరేవా రింకెవరూ లేరని నేను చెప్తున్నమాటను పొరపాటున నువ్వుకూడా అవిశ్వాసంతో త్రోసిపుచ్చ వద్దు సుమా !

రమే—కాని పెద్దమ్మా—

విశ్వే—రమేశ్, ఇందులో కాని-గీనిలకు తావులేదు. నువ్వు విన్నదంతా శుద్ధఅబద్ధం; నీకు తెలిసినదంతా తప్పు. యింక యీ నేరాన్ని యింతటితోనే వదిలెయ్యి. నీ కళ్యాణ కార్యక్రమం వరదలా పొంగిపొర్లుతూ సమస్త ఈర్ష్యా-ద్వేషాలను లోగొని ముందుకు సాగిపోవాలనే ఆమె తుదిప్రార్థన రమేశ్! అందువల్లనే ఆమె నోరు మూసుకొని అన్నీ సహించుతూవచ్చింది. ఆమె ప్రాణంపోతున్నా నీతో ఆమాట చెప్పలేదు.

రమే—పెద్దమ్మా! ఆమెతో...

విశ్వే—నువ్వే ఆమెతో చెప్పు నాయనా! నా కిప్పుడు తీరిక లేదు.

[యతీంద్రుని వెంటపెట్టుకొని రమ ప్రవేశం! ఆమెదుస్తులను చూస్తే ఎక్కడికో ప్రయాణమైవున్నట్టు విదితమవుతుంది.]

రమే—[చకితుడై] ఇదేమిటి? ఇంత రాత్రివేళ ఈ వేషమూ?

రమ—రమేశ్ బావా, నేను యాత్రకు బయల్దేరాను. ఇం కెంతో ప్రొద్దులేదు. కాని ఇంకా ఒకటిరెండు పన్లు మిగిలిపోయాయి. మీ పాదధూళి స్వీకరించి, జతిన్ని మీకు అప్పగించటం ముఖ్యం.

రమే—ఈ భారం నాపైనే మోపి వెళ్తావా రమా?

రమ—రమ కాదు, రాణీ అనండి. ఆ రాణికి అన్నిటికీ మించిన ప్రియధన మీ తమ్ముడే. రమేష్ బావా, వీనిని మీరు గాక యింకెవరు తీసుకుంటారు?

రమే—కాని, ఇందులో యెంత జవాబుదారీ వున్నది రమా! ఆ ప్రార్థన—

రమ—ఇంకా ఆ రమేనా? కాని యిది ప్రార్థన కాదు; ఆమె హక్కు. ఈ హక్కుతోనే ఒకప్పుడీ ప్రపంచం లోకి వచ్చింది; ఈ హక్కుతోనే ఈ ప్రపంచాన్నుంచి కూడా వెళ్ళబోతోంది. అధికారానికి అంతంలేదు బావా! దీన్నుంచి మీ రెలా తప్పించుకోగలరు? ఇదుగో.

[అని రమేష్ చేతితో జితిన్ చేతిని పట్టిస్తుంది. తర్వాత నేలబారుగ వంగి నమస్కరించుతుంది.]

